# సమర్థ సద్గురు

## ఆధ్యాత్మిక మాసపత్రిక

శ్రీకాళీగార్డెన్స్ ఆశ్రమం - 522508, గుంటూరు జిల్లా
ఫోన్ : (0863) 2293280, 2293564, 2293206
web: www.mathaji-babuji.org samardhasadguru@rediffmail.com



Volume 29 Issue 3
No.of Pages 56
NOVEMBER 2009

| | | |
|---|---|---|
| 5సం॥ల చందా | రు. | 250.00 |
| 2సం॥ల చందా | రు. | 120.00 |
| సంవత్సర చందా | రు. | 60.00 |
| విడిప్రతి వెల ..... .. | రు. | 5.00 |

బ్యాంక్ డ్రాఫ్ట్స్ A/C.Y.S.C.K.P.M చారిటబుల్ ట్రస్ట్ పేరులో డ్రా చేయండి. M.O.,బ్యాంక్ డ్రాఫ్ట్స్ పంపవలసిన చిరునామా:
మేనేజరు
సమర్థసద్గురు మాగజైన్
శ్రీకాళీగార్డెన్స్-522508

Printed and Published by C.V. Ramana Babu, on behalf of YOGINI SRI CHANDRA KALI PRASADA MATHAJI CHARITABLE TRUST and Printed at Samardha Sadguru Publications, D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh, and published at D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh. Editor - Guda Siva Rama Murthy,

**ఈ సంచికలో.... పేజీ**



**శ్రీసద్గురుదేవుల ఆరాధన ప్రత్యేక సంచిక**

# భద్రవాక్యం

**మనో హి ద్వివిధం ప్రోక్తమ్ । శుద్ధం చాశుద్ధమేవ చ ।**
**అశుద్ధం కామసంకల్పమ్ । శుద్ధం కామవివర్జితమ్ ॥**

-అమృతనాదబిందూపనిషత్

ఈ మంత్రం అమృతనాదబిందూపనిషత్‌లోని ప్రథమ శ్లోకం. మనస్సు రెండు విధాలు అని చెప్పబడుతున్నది, శుద్ధ మనస్సనీ, అశుద్ధ మనస్సనీ. కామసంకల్పములతో కూడకుని ఉన్నది అశుద్ధ మనస్సు. కామ సంకల్పములచేత విడువబడినది శుద్ధ మనస్సు అని పై మంత్రానికి స్థూలంగా తాత్పర్యం.

అసలు మనస్సు అంటేనే సంకల్ప వికల్పాలు చేసేది. సాధారణంగా అన్ని సంకల్పాలు కామం లేదా ఏదో ఒక కోరికతో కూడి ఉంటాయి. దుష్ట సంకల్పాలు ఇనప సంకెళ్ళ వంటివి అయితే, మంచి సంకల్పాలు బంగారు సంకెళ్ళ వంటివి, అన్ని సంకల్పాలు బంధ హేతువులే అని చెప్తారు. కామం అనగానే అది తప్పకుండా చెడ్డది, బంధహేతువు అనుకోకూడదు. **ధర్మాZ విరుద్ధో భూతేషు కామోZస్మి భరతర్షభ** అని గీతాచార్యుడు భగవద్గీత విజ్ఞాన యోగంలో చెప్తాడు. కనుక ధర్మ విరుద్ధంకాని కామం ఉన్నట్లైతే, మనస్సు కామసంకల్పంతో కూడినదైనా అది అశుద్ధ మనస్సు కాదు. ఉదాహరణకు నేను ఆత్మను, లేదా ఇంద్రియ గోచరం అయ్యే ఇదంతా బ్రహ్మమే, నేనే ఆ బ్రహ్మమును, లేదా నాకు మోక్షం కావాలి వంటి సంకల్పములతో కూడిన మనస్సు అశుద్ధ మనస్సు కాదు. అటువంటి కోరికలు బంధహేతువులు కాక బంధమోక్షానికి కారణమౌతాయి. అప్పుడు మనస్సు లేకుండా పోదు. కాని మనస్సు ఉన్నా, ఆకారానికి త్రాడులాగా ఉన్నా బంధించే శక్తి లేని కాలిపోయిన త్రాడు లాగా, నిర్వీర్యం అయి, లేని దానితో సమానంగా ఉంటుంది. అటువంటి మనస్సు తప్పక శుద్ధ మనస్సే. ఇక కామ సంకల్ప వర్జితులు నిజంగా బుధులే. వారి మనస్సు నిత్య శుద్ధం. శుద్ధ మనస్సే ఆత్మ అని శ్రీ రామకృష్ణ పరమహంస చెప్తారు. అది శాస్త్రాలు కూడా అంగీకరించిన సత్యం.

కాని నేను ఈ దేహాన్ని, లేదా ఈ దేహమే ఆత్మ వంటి సంకల్పాలతో, ఆణవ, కార్మిక, మాయిక మలములతో కూడిన ధర్మ విరుద్ధములైన కామములతో కలుషితం అయి ఉన్నదానిని ఉన్నట్లు చూడనీయక ఆత్మానుభూతికి ప్రతిబంధకంగా ఉండే మనస్సు అశుద్ధ మనస్సు.

అలా ప్రతి వారిలో ఈ మనస్సు రెండు విధాలుగా పనిచేస్తూ బంధానికీ, మోక్షానికీ రెంటికీ కారణము, సాధనమూ కూడా అవుతున్నది. *

## అమ్మ ఆశీస్సులు

**యస్య ప్రసాదా దహమేవ సర్వం మయ్యేవ సర్వం పరికల్పితం చ।**
**ఇత్థం విజానామి సదాత్మరూపం తస్యాంఘ్రిపద్మం ప్రణతోఽస్మి నిత్యం॥**

ఏ మహాత్ముని యొక్క అనుగ్రహముచే దృశ్యజాతమంతయు పరబ్రహ్మ స్వరూపుడనగు నా చైతన్య స్వరూపమైనదో, ఆ జగమంతయు సర్వాధిష్ఠాన పరమాత్మనగు నా యందు కల్పింపబడినదో, ఇట్లభేదరూపముగ నేను సత్తగు ఆత్మస్వరూపునిగా(పరబ్రహ్మ స్వరూపునిగ) తెలియుచున్నానో అట్టి శ్రీ గురుదేవుల పాదారవిందమునకు నిరంతరము నమస్కరించుచున్నాను. ఇది శ్రీ గురుగీత గ్రంథములో సాక్షాత్తు శ్రీ శంకరభగవానుడు జగన్మాత పార్వతీ దేవికి చెప్పిన మంత్రము. నిగ్రహము కలిగియున్న సచ్ఛిష్యునియందు అనుగ్రహముతో శ్రీ గురుదేవుని పరిపూర్ణ ప్రసాదమే ఈ అనుభవము. అంతటా నిండియున్న మహా శక్తి మనను అనుగ్రహించుటకు శ్రీ సద్గురుదేవులుగా అవతరిస్తున్నది. **"ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా''**॥ ఉపాసకులను తత్త్వ స్వరూపులుగా అనుభవింప చేయుటకు బ్రహ్మమే రూపమును ధరించినది.

**"మయ్యేవ సకలం జాతం, మయిసర్వం ప్రతిష్ఠితం ।**
**మయి సర్వం లయం యాతి, తద్బ్రహ్మాద్వయమస్మ్యహం ॥**

కైవల్యోపనిషత్తు ఈ విధముగా బోధించుచున్నది - సర్వసృష్టి స్థితి లయములు నాయందే ఉన్నవి. అట్టి బ్రహ్మయే నేను అన్న దృఢాపరోక్షానుభూతిని శ్రీగురుదేవులే అందిస్తున్నారు. అట్టి శ్రీ సమర్థ సద్గురుదేవుల పుణ్యారాధన మహోత్సవములు, అదీ కార్తీకమాసంలో తదియ(కృష్ణపక్ష)నుండి దశమి వరకు, 5-11-2009 గురువారము నుండి 12-11-2009(తెల్లవారితే గురువారము). శ్రీ సద్గురుదేవులు అన్నిటిలోను తానేయై ఈ ఇంద్రియములతో కూడిన మన ఈ జీవితములతో సేవ చేయించుకునే, సేవ చేసే ఆ మహాశక్తియై, తృప్తి, సంతోషము, ఆనందము అగు జీవిత పరమావధిని గుర్తింప చేస్తున్నారు.

ఇంతలో 12-11-2009 మధ్యాహ్నం సత్సంగము, శ్రీ సద్గురు పాదపూజ, రాత్రి తెప్పోత్సవము పెదనింద్రకొలను శాఖలో జరుగుతాయి. శ్రీ సద్గురుదేవులే అందరినీ ఆనందింప చేస్తారు. 21-11-2009 నుండి 27-11-2009 వరకు కట్టమూరులో శ్రీ బాబా భక్త సమాజ్‌వారి చేత **శ్రీ సద్గురు గణపతి,సౌర, రుద్ర,చండీ, విష్ణు యాగము** జరుగును. భక్తులందరికీ ఆహ్వానము. ఈ ఏడు రోజులలో సత్సంగములు, మహాప్రసాదమును వారి ద్వారా శ్రీ సమర్థ సద్గురు దేవులు అందరికీ అందిస్తున్నారు. ఇట్టి మహత్తర కార్యక్రమములలో పాల్గొని సేవించుకొని తీర్థ ప్రసాదములను తీసుకొని అందరూ తరింతురు గాక! అట్టి శక్తిని, భక్తిని, అఖండ సాధన సంపత్తిని శ్రీ సద్గురు దేవులు ప్రసాదించెదరు గాక. *

\- మీ అమ్మ

# సంపాదకీయం

**న గురోరధికం న గురోరధికం న గురోరధికం న గురోరధికం**
**శివశాసనతః శివశాసనతః శివశాసనతః శివశాసనతః** -గురుగీత

సాక్షాత్తూ పరమశివుడు పార్వతీదేవికి అనుత్తమము, అద్వితీయము అయిన గురు ఔన్నత్యాన్ని గురించి చెప్పిన పై శ్లోకం గురుగీత లోనిది. న గురోరధికం అంటే చాలు కదా! ఊహుం . పరమ శివుడు అంత మాత్రమే చెప్తే చాలలేదనుకొన్నాడు. న గురోరధికం అని మళ్ళీ అన్నాడు. అప్పటికీ తృప్తి కలగలేదు. గురు ప్రభావాన్ని, ఆధిక్యతను వర్ణించటానికి అదికూడా సరిపోదనిపించింది. అందుకే మళ్ళీ ఈ సారి న గురోరధికం, న గురోరధికం అని రెండు సార్లు అన్నాడు. ఈ విషయంలో ఎవరికైనా అనుమానం కలుగుతుందేమో అని శివశాసనతః అని ఒకటి కాదు, రెండు కాదు నాలుగు సార్లు అన్నాడు.

గురుదేవుడు ఎంత గొప్పవాడంటే మన ఊహకు అందనంత గొప్పవాడు. ఇక అంతకంటే గొప్పవాడు ఎవరూ లేనంత గొప్పవాడు. అందరూ తనకు నమస్కరించే శివుడుకూడా ఆ గురుదేవులకు నమస్కరిస్తాడంటే ఆ గురుదేవుడు ఎంతటి గొప్పవాడో ఊహించుకోండి. బ్రహ్మ, విష్ణు, శివాత్మకమైన పరబ్రహ్మమే సద్గురుదేవులు.

అటువంటి సమర్థ సద్గురు దేవులు ఒక కమనీయాకృతితో మన మధ్య, మనలో ఒకరుగా మసలి, కాలుణ్ణి సహితం ధిక్కరించి ఎందరికో ప్రాణదానం చేసి,విశ్వమతస్థాపనచేసి తమ జ్ఞానరోచిస్సులతో ఎందరికో జ్ఞానాన్ని ప్రసాదించి, అందరి హృదయబాబుగా అయి తమ వ్యక్త రూపాన్ని ఉపసంహరించుకొని అవ్యక్తులై, స్వస్వరూప స్థితిని పొందిన సందర్భాన్ని పురస్కరించుకొని, వారి ఏక వింశతి వార్షిక పుణ్యారాధాన మహోత్సవాలు పంచ యజ్ఞ విధి పూర్వకంగా ఈ నెల ది.5 నుండి ది.12 వరకు ఆశ్రమంలో జరుగుతాయి. భక్తుల సౌలభ్యం కోసం ది. 8 (ఆదివారం) సామూహిక గురుపూజలు ఏర్పాటు చేశారు. ఈ సందర్భంగా ఈ సంచికను భక్తుల అనుభవాలతో 56 పుటలతో ఆరాధన ప్రత్యేక సంచికగా వెలువరిస్తున్నాము.

ఆశ్రమంలో జరిగే పుణ్యారాధన మహోత్సవాలకు, ఆశ్రమంలో కార్యక్రమాలు ముగియుగానే ది.12 పెదనింద్రకొలను శాఖలో జరిగే కార్యక్రమాలకు కార్య నిర్వాహక సభ్యుల తరపున అందరినీ సాదరంగా ఆహ్వానిస్తున్నాము - గౌరవ సంపాదకుడు

# బాబూజీ ఉవాచ

(గత సంచిక తరువాయి) - స్వామి విజయేశ్వరానంద ప్రసాద్

వెనుకటి యుగాలవారి మాట అలా ఉంచి, యీ యుగంలోనే అలా భగవానుని కమనీయాకృతిని దర్శించి తరించిన భక్తులెందరెందరో. రామకృష్ణ పరమహంస మేలిమి బంగారము. రమణ మహర్షి జాతిరత్నము. స్వామి రామతీర్థ మహాతత్త్వవేత్త. త్యాగయ్య తన హృదయంలోనే గాక చీమ నుండి బ్రహ్మ వరకు అన్నిటిలోను రామదర్శనం చేయగలిగాడు. తాను కూడా అదే స్వరూపము పొందాడు. ఆ ప్రభువు దివ్య నామ స్మరణ చేస్తూ మీరా పుచ్చుకున్న విషం కూడా అమృతంగా మారి పోయింది. అట్టి అవ్యాజ కరుణామూర్తి దయను మీరు ఏల జుర్రుకోరు? ఆయన క్రీగంటి కిరణాలు ఏ హృదయంలో ప్రవేశిస్తే అందలి సర్వ కలుషాలూ హరిస్తాయి.



కళంకరహితము, నిస్స్వార్థము అయిన ప్రేమయేనేనని, కలుష రహితమైన మంచియే నేనని, శాశ్వతమైన సత్యమే నేనని భగవానుడంటాడు. అటువంటి కళంకరహితమైన ప్రేమను, కలుష రహితమైన మంచిని తోటి మానవులకు అందించమని, వారి యందలి సత్యవస్తువునే గుర్తించి ఆదరించమని, ఆ విధంగా సర్వ మానవుల యందు నిండి నిగూఢమై ఉన్న తనను దర్శించవచ్చునని అంటాడు. "నిస్స్వార్థ ప్రేమను, మంచిని, సత్యమును నింపుకొన్న శుద్ధ మనస్సులో పూర్ణంగా ప్రకాశిస్తూ ఉంటాను. కలుష హృదయం గల మానవునిలోనూ నేను ఉంటాను. కాని రాగద్వేషాలు, ఈర్ష్యాసూయాదులైన కలుషాలతో నన్ను మూసి ఉంచేస్తాడు. కనుక దర్శించిలేడు" అంటాడు. ఒక దీపం వెలుగుతోంది. దానిపై ఒక గాజు గ్లాసు, దానిపై ఒక చిల్లుల గంప, దానిపై ఒక యినుప మూకుడు బోర్లించామనుకోండి. ఆ దీపం మనకు కనపడదు. ఇనప మూకుడు తమోగుణం. అది తీసివేస్తే చిల్లుల గంప. చిల్లుల్లోంచి కొద్దిగా వెలుతురు కనపడీ కనపడనట్లుగా ఉంటుంది. అది రజోగుణం. దాన్ని కూడా తీసివేస్తే, గాజుగ్లాసులోంచి వెలుతురు బాగా స్పష్టంగా కనపడుతుంది. అది సత్త్వ గుణం. కాని అది కూడా మనం దీపాన్ని అందుకోటానికి అడ్డుగానే ఉంటుంది గనుక దాన్ని కూడా తొలగిస్తే ఇక

దీపానికి మనకూ ఏదీ అడ్డురాదు. పరంజ్యోతి స్వరూపుడైన భగవానుని మనం అందుకోవాలంటే సత్త్వ రజస్తమోగుణాలను తొలగించుకోవాలి. లోకాలను, లోకస్థులను, లోకేశులను దాటి పెంజీకటికి ఆవల వెలిగే జ్యోతిని దర్శించాలంటే కాంతి వేగాన్ని మించిన మనోవేగం కూడా చాలదు. కాని ఆ మనస్సునే ఆ స్వామి పాదారవిందముల యందు నిలిపి లయింపచేస్తే, తృటిలో మానవుడు అనాయాసంగా చేరగలడు. మనస్సు ఆయన ధ్యానంలో ఏకాగ్రత పొందే కొలదీ దాని వేగం పెరుగుతుంది. ఆ చరణదర్శనమై, అందులో మనస్సు లయించినంతనే యిక వేగమూ, గమనమూ అన్నీ ఆగిపోతాయి. శాశ్వత శాంతి లభిస్తుంది. స్వల్పమైన మానవ జీవిత వ్యవధిలోనే యీ విధంగా భగవానుని దర్శనం తేలికగా పొందవచ్చు.

అంత తేలికగా భగవానుని దర్శనం పొందవచ్చునా అని సందేహించకండి. భగవానునిలో ఏవి లేవో, అవి నీలో కూడా లేకుండా చేసుకుంటే, అంతే; వెంటనే దర్శనము! ఆయనలో, జాతి, నీతి, కుల, గోత్ర భేదములు, నామ, రూపాలతో కూడిన నానాత్వాలు, గుణదోషాలు, దేశము, కాలము మొదలైన విషయాలు లేవు. అవి నీలో కూడా లేకుండా చేసుకోగలిగితే చాలు. అయితే అవన్నీ ఒక మహారణ్యం వంటివి. ఆ అరణ్యం ఒక్క జ్ఞానాగ్ని వలన మాత్రమే దగ్ధం అవుతుంది. అలా అవన్నీ ఉడిగిపోతే మనస్సు ఆయన చరణాలకు attach అయిపోతుంది. ఒకసారి మనస్సు ఆ దివ్య పాదాలకు attach అయితే, ఆ మధురాన్ని చవిచూడగలిగితే చాలు. ఇక మనస్సు అందులో శాశ్వతంగా లయించి తద్రూపాన్ని పొందుతుంది.

అదే రాధ అనుభూతి. "అధరం మధురం వదనం మధురం" అంతా మధురమే. పంచదార చిలుక ముక్కు వద్ద కొరికినా, తోక వద్ద కొరికినా తియ్యగానే ఉంటుంది. ఆ మందహాసంలోని మధురాన్ని ఆనందాన్ని చవి చూసింది. గనుకనే రాధ తన్ను తాను మైమరచి పోయింది. గోపికలందరు త్రికాలముల యందు అదే ధ్యాసలో మైమరచిపోయారు. అలా మైమరచిన గోపికల ముఖాలలో దివ్య తేజస్సు వెలిగేది. అటువంటి భావ సమాధిలో మునిగిన గోపికలు సర్వకాల సర్వావస్థల యందు, సర్వే సర్వత్ర కృష్ణునే తప్ప రెండవ వస్తువును చూడలేకపోయారు. అదే మధుర భక్తి. ఆవకాయలో వేసిన సెనగగింజ ఆవకాయ రుచిని పొందినట్లే, మధురాధిపతి మధుర నామస్మరణలో నిమగ్నమైన వారి మనస్సులు ఆ మధుర రూపాన్నే పొందాయి. వాళ్ళూ తద్రూపాన్నే పొందారు.

-సశేషం

# మాతాజీ అభిభాషణ

(గతసంచిక తరువాయి)

-జపమాల ప్రసాద

అనగా అనగా రాగం, తాళం అన్నీ యింకా బాగా వస్తాయి. తినగా తినగా వేపకాయ కూడా తియ్యగానే అనిపిస్తుందిట. అలాగే సాధన చేసే కొలదీ యీ ప్రపంచంలో మనం సాధించలేనిది ఏదీలేదు. భగవన్నామం చేసేటప్పుడు మన మనస్సు అందులో లయిస్తేనే ఆనందం దొరుకుతుంది గానీ, తాళాలపైనా, ప్రక్క వాద్యాలపైనా, మైకుల పైనా దృష్టి ఉంటే లాభం లేదు. అనుక్షణం మాయ మనని వెన్నంటే ఉంటుంది. ఆ మాయని దాటడానికి హరి నామ మొక్కటే శరణ్యం అని తలచి నామం చేయాలి.



అనేక విధాలుగా అటూ ఇటూ పరుగుపెట్టే మనసుకి నిలకడ కలిగించేది భగవన్నామ సంకీర్తన. మనపైన మనకే నమ్మకంలేదు. మనని మనమే నమ్మితే భయమెందుకు? మాయ చేసేది మనసు. దానికి ఒక అండ దొరకాలి. ఉన్నతమైన స్థితిని పొందడానికి దానికి ఆలంబన కావాలి. ఆ ఆలంబననిచ్చే కొండంత అండ భగవన్నామం. అదే మంత్రం. మననం చేసేకొద్దీ మనకి రక్షణనిచ్చి కాపాడేది మంత్రం. ఆ మంత్రము ద్వారా గురుతు తెలిపేవారే గురువులు. సత్యగురువు లెవ్వరూ కూడా, 'నేను గురువుని నా దగ్గరకు రండి' అని అనరు. రాముడన్నాడా నేను దేముడిని అని ? మాయా మానుష విగ్రహరూపం దాల్చివచ్చి, ఆదర్శ మానవుడంటే ఎలాఉండాలో మనకి చూపెట్టిన మర్యాదా పురుషోత్తముడు రాముడు. ఆయన చేసి చూపెట్టాడు కనుక, ఆయన చేసినట్టు మనం చేయాలి. మరి కృష్ణుడో? ఆయన లీలా మానుష విగ్రహుడు. ఆయన అవతారానికి వచ్చినప్పటినుంచీ తన దివ్యత్వాన్ని చాటి చెప్తూనే వున్నాడు. అది గ్రహించినవారికి ఆయన అవతార రహస్యం తెలిసి, ఆనందంలో ఓలలాడారు. చిన్ని కృష్ణుడు ముసిలివాడి గడ్డానికి, ఆవుదూడతోకకి ముడివేసి 'ఛలో' అన్నాడు కదా అని మనం చేస్తే, అంతే సంగతులు. మనకి బడితపూజే గతి! ఆ కృష్ణ పరమాత్మ ప్రతి చేష్టలోను ఎంతో తత్త్వం దాగివుంది. ఆ ముసలివాడిలో ఏ గుణాలు చెలరేగుతున్నాయో

ఏమో? వాటిని కట్టి వేశాడాయన! అలాగే ఆయన రాసలీలా రహస్యం కూడాను. జీవుడు చైతన్యంతో కలసి ఉండడమే రాసలీల.

మీరా, కబీర్‌దాసు, త్యాగరాజస్వామి, రామకృష్ణ పరమహంస, వివేకానంద, అస్మద్గురుదేవులు శ్రీబాబూజీ మహరాజ్, అవధూతేంద్ర సరస్వతి స్వామీజీ వంటి మహాత్ములెందరో నామ సంకీర్తన ప్రాశస్త్యాన్ని లోకానికి చాటి చెప్పి, వారు నామం చేస్తూ మనని కూడా చేయమన్నారు. అసలు నామం చేసేవారి సన్నిధిలో ఉంటే చాలు, మనకి కూడా నామం అబ్బుతుంది. చక్కని సంకీర్తన రేడియోలో విన్నా, భక్తుడైన వాడు ఆనందాన్ని పొందుతాడు.

భగవన్నామం తెలిసి అనాలి. అప్పుడే మనం అందులోని మధురాన్ని జుర్రుకోగలుగుతాం. "తెలిసి రామచింతన చేయవే మనసా" అన్నారు త్యాగరాజస్వామి. తెలియాలి అంటే తెలిసే చోటుకి వెళ్ళి నేర్చుకోవాలి. దాని యందు అనురక్తి కావాలి. నేర్చుకోమన్నారు కదా అని, ఏదైనా సంగీతం పాఠశాలకి వెళ్ళాలని అనుకోకండి. మనం సంగీతం గురించి మాట్లాడుకోవడం లేదు. భగవన్నామం గురించి మాట్లాడుకుంటున్నాం. నిరంతరం భగవన్నామ రసాస్వాదన చేసే మహాత్ములను ఆశ్రయిస్తే, మనకి భగవన్నామంలోని మాధుర్యాన్ని ఎలా జుర్రుకోవాలో తెలియచేస్తారు. వారు చెప్పిన విధంగా ఆచరిస్తే మనకి కూడా వారు పొందుతున్న ఆనందం దొరుకుతుంది. దురదృష్టవశాత్తు నేటి మానవుడికి ప్రపంచ విషయములందు అనురక్తి ఎక్కువై భగవన్నామమందు ప్రీతి తక్కువైపోయింది. మనం తినే ఆహారం భౌతిక శరీరానికి పుష్టినిస్తుంది. కాని మన మనస్సుకి కావలసిన పుష్టినిచ్చే ఆహారం, భవగన్నామము, భగవత్తత్వ విచారణ. భగవన్నామాన్ని అనడం వలన మనస్సులోని పాపం, మాలిన్యం క్షాళనమవుతాయి. భగవత్తత్వం విచారణ చేయడం వలన మనస్సు యొక్క చాంచల్యం తగ్గి, స్థిరత్వం సిద్ధిస్తుంది. అంటే మల, విక్షేపదోషాలు హరిస్తాయన్న మాట. ఇక భగవద్ధ్యానం వలన ఆవరణ దోషం కూడా పోయి, శుద్ధాత్మ స్వరూపం భాసిస్తుంది. అందుకనే భగవన్నామానికి అంత గొప్ప శక్తి ఉందని కలిసంతరణోపనిషత్తు చెపుతోంది. నారాయణుడి నాభికమలం నుండి బ్రహ్మదేవుడుద్భవించాడు. బ్రహ్మముఖస్తుగా వేదాలు వచ్చాయి. వేదాల నుండి ఉపనిషత్తులు, ఉపనిషత్తులనుండి భగవద్గీత, భగవద్గీత నుండి భగవన్నామం వచ్చాయని గురుమహరాజ్ సెలవిచ్చి ఉన్నారు.

-సశేషం

# సన్నిధిలో సంభాషణ

(గతసంచిక తరువాయి) - పరాశర ప్రసాద్

అలాగే భగవద్గీత పారాయణ చేసినంత మాత్రాన మీరు తరించ గలుగుతారు అనుకోవటం కల్ల. భగవద్గీత ఏమి బోధించిందో దాన్ని అనుభవ పూర్వకంగా తెలిసికోవాలి అన్నారు శ్రీబాబు.

ఒక భక్తుడు శ్రీబాబుని ప్రశ్నిస్తూ మేము ఎంత ప్రయత్నించినా మనస్సు కొన్ని రుచులకు అలవాటు పడటం చేత విషయాదుల మీదకే పోతోంది. భగవంతుని ఆజ్ఞ లేనిదే ఏమీ జరగదుకదా! మరి భగవంతుడు మా మనస్సును విషయాదుల మీదకి పోకుండా ఎందుకు చేయకూడదు? అని ప్రశ్నించాడు.

శ్రీబాబు మాట్లాడుతూ నేను అమెరికాలో ఉండగా ఎవరెవరు ఏమి చేసినది, ఎవరి మనస్సు ఏ రకంగా సంకల్పించినదీ, ఎవరు ఎంత ధ్యానం చేసినదీ గమనించాను. నీ ప్రశ్న బాగానే ఉంది. కాని నేను చెప్పినట్లు నీవు చేస్తున్నావా? తెల్లవారుజామున లేచి ధ్యానం చేయమన్నాను. చేస్తున్నారా? మీ మనస్సు భగవన్నామం మీద నిలిపితే ఇంక విషయాదుల మీదకు ఎందుకు పోతుంది? మనస్సులో భగవంతుణ్ణి ధ్యానిస్తే నీ మనస్సు దేనిపైకీ పోకుండా ఆయనే చూసుకుంటాడు. ధ్యానం లోపిస్తే ఆయన ఏం చేస్తాడు?

ఇంకొక భక్తుడు మాట్లాడుతూ పాటలు రికార్డుచేసి వింటున్నాను బాబూ అన్నాడు. శ్రీబాబు మాట్లాడుతూ గడ్డి అంతా పోగుచేస్తున్నావన్న మాట. సంకీర్తన ఎంతవరకు నీకు సహకరిస్తుంది? బాహ్య శబ్దాలు మనస్సుకి ఏ విధమైన అంతరాయం కలిగించకుండా తోడ్పడుతుంది. కాని మానవుడిని తరింపజేస్తుందా? నువ్వు సంకీర్తన చేసి నీ మనస్సు ఆ ప్రభువు దివ్య చరణారవిందాలపై నిలిస్తే అది వేరు. అంతేగాని నువ్వు సంకీర్తన విన్నంత మాత్రాన తరింపజాలవు. నీకు ధ్యానంలో నిద్ర రాకుండా అది సహకరిస్తుంది. కాలాన్నంతా దుర్వినియోగం చేసి రికార్డుచేసి ప్రత్యేకంగా అదే వినవలసిన పని లేదు అన్నారు శ్రీబాబు.

**2-3-1985**

ఈ రోజు రాత్రి ప్రార్థన అయిన తరువాత అనంత పద్మనాభశాస్త్రిగారు తన Ph.D థీసిస్ శ్రీబాబుకి అంకితమిచ్చినట్లు చెప్పారు. ఆ పుస్తకానికి

'సహృదయ పీఠిక' డా॥ రావుగారు రాశారు. పద్మనాభ శాస్త్రి శ్రీబాబుకి నమస్కరించి ఆ పీఠిక చదవటానికి అనుమతించమని కోరారు. శ్రీబాబు మాట్లాడుతూ నీవు వ్రాసిన పుస్తకము నాకు అంకితం ఇస్తావా! అలా అయితే దానిని ఎవరికైనా అమ్ముతావా? అని ప్రశ్నించారు. శాస్త్రిగారు మాట్లాడుతూ లైబ్రరీలకు అమ్ముతాను బాబు అని అన్నారు. శ్రీబాబు మాట్లాడుతూ ఆ పుస్తకం నాకు అంకితం ఇవ్వదలచుకుంటే దానిని ఎవ్వరికీ అమ్మకూడదు. దానికి వెల ఉండకూడదు. ఎవ్వరికైనా ఇవ్వదలచుకుంటే ఉచితంగా ఇవ్వాలి. దానికి అంగీకరిస్తే నీవు నాకు అకింతమిచ్చే పుస్తకాన్ని స్వీకరించటానికి నాకు అభ్యంతరం లేదు. అయినా ఎంతో మంది పండితులు, కవులు, చదువుకున్నవారు ఉండగా ఈ బికారివాడికి ఎందుకు అంకితమివ్వాలి? నాలో ఏముందని చూసి అంకితం ఇస్తున్నావు? ఆ చదువురానివాడికి ఎందుకు అంకితం ఇచ్చావు అని నీ స్నేహితులెవరైనా నిన్ను విమర్శించారు అనుకో వాళ్ళకి ఏమని సమాధానం చెబుతావు? ముందు ఆ విషయాన్ని చెప్పు. తరువాత ఆ పీఠికను చదువు.

అప్పుడు శాస్త్రిగారు మాట్లాడుతూ 'మీరు నా గురుదేవులు, సద్గురు మూర్తి. అంతేకాక నేను వ్రాసిన మొదటి పుస్తకం కాబట్టి ఈ పుస్తకాన్ని మీకే అంకితమిద్దామని మొదటి నుంచీ అనుకుంటూనే ఉన్నాను' అన్నారు.

శ్రీబాబు మాట్లాడుతూ 'నేను సద్గురువు అని ఎలా తెలుసు? నా అడ్రెస్ చూసి అనుకున్నావా? లేక నా చొక్కా చూసి అనుకున్నావా? నా పంచెను చూసి అనుకున్నావా? నా మెడలో ఉన్న ఈ గొలుసును చూసి భావించావా? ఇవన్నీ కలిగి ఉన్న నన్ను సద్గురువు అంటే ఎవరు నమ్ముతారయ్యా శాస్త్రీ. అయితే నడక మాత్రం ఠీవిగా యదుసింహుని వలె ఉంటుంది. నీ పుస్తకం అంకితం ఇవ్వటానికి నాకు ఉన్న అర్హత ఏమిటి? నేను బ్రాహ్మణుడను కాను, క్షత్రియుడనుగాను, శూద్రుడను అంతకంటే కాదు. చదువురాని వాడను. మరి నాలో గురు లక్షణం ఏం చూశావు? నీవా బ్రాహ్మణుడవు. నాకు అంకితమిస్తే నీ బ్రాహ్మణత్వానికి లోటు వస్తుందేమో చూసుకో. అయినా నీ బంధువులను, మిత్రులను, శ్రేయోభిలాషులను సంప్రదించి నిర్ణయం తీసికున్నావా? శ్రీకృష్ణపరమాత్మను చూసి దుర్యోధన వర్గం భావించిన విధంగా వారు భావిస్తారా? లేక గోపికల వలె, అక్రూరుని వలె భావిస్తారా?' అని ప్రశ్నించారు.

-సశేషం

## శ్రీకాళీగార్డెన్స్‌లో విశేషపూజా కార్యక్రమములు

**నవంబరు 2009**

2 సోమ గురుపూర్ణిమ, శ్రీ సద్గురు పాద పూజ, సత్సంగం, భక్త సమారాధన,శ్రీ ఉమా రామలింగేశ్వరుల నగరోత్సవము, జ్వాలా తోరణం, శ్రీ మాతాజీ వారి చాతుర్మాస్య దీక్షా విరమణ.

**5 గురువారం నుండి 12 గురువారం వరకు శ్రీ గురుదేవుల ఏకవింశతి వార్షిక పుణ్యారాధన మహోత్సవాలు**

5 గురు ఉదయం పంచ యజ్ఞ సహిత పుణ్యారాధన మహోత్సవ సాప్తాహ్నిక దీక్షా స్వీకరణ, అఖండ జ్యోతి ప్రజ్వలనం, పంచ యజ్ఞ విధులతో దీక్షా ప్రారంభం.

5వ తేదీనుండి - 12వ తేదీ వరకు ప్రతిరోజు - ఉదయం 4 గం.లకు సుప్రభాతం, నగర సంకీర్తన, 5 గం.లకు ప్రాతఃకాల ప్రార్థన, మహామంగళ హారతి. 6గం.లకు బ్రహ్మశ్రీ కొండూరు రామ సుబ్రహ్మణ్యం గారిచే వేద పఠనము, ఆలయ దర్శనములు, తీర్థప్రసాదములు.

5 - 11 వరకు ప్రతిరోజు ఉదయం 8 గం.లకు శ్రీ రామ తారక పరబ్రహ్మ ప్రసాద్, శ్రీ వెంకటరమణ ప్రసాద్ గార్లచే శ్రీ గురుగీతా ప్రవచనము. ఉదయం 9 గం.లకు సత్సంగ సమావేశము, శ్రీ మాతాజీవారి అనుగ్రహభాషణ,సద్గురుదేవుల దర్శనము, బోధ (వీడియో).శ్రీ బాబూజీ మహరాజ్ వాడిన వస్తువుల మ్యూజియమ్ ప్రదర్శన (అర్ధగంట). మధ్యాహ్నం 2 గంటలకుశ్రీ సద్గురు శత సహస్ర నామార్చనము, మహామంత్ర పుష్పము, దర్బారు. అనంతరం శ్రీ మాతాజీవారు భక్తులకు తీర్థం ఇస్తారు. భక్త సమారాధన, సాయంత్రం 6 గం.లకు ప్రార్థన, మహా మంగళహారతి.

**విశేష కార్యక్రమాలు**

5 గురు ఉదయం 8.24 గంటలకు పూజ్యశ్రీ మాతాజీ వారిచే సాప్తాహ్నిక దీక్షా సంకల్పము, పంచ యజ్ఞ విధులతో దీక్షా ప్రారంభము.రాత్రి 7 గంటలకు శ్రీ సద్గురు దేవుల పుణ్యారాధన(గురు సాంప్రదాయం లోని వారికి)

7 శని రాత్రి 7 గం.లకు సమర్థ సద్గురు మధుర లీలాష్టకం నాటకం (యువ సేవా సమితి వారి అధ్వర్యంలో)

8 ఆది సామూహిక సద్గురు పూజలు. రాత్రి 7 గం.లకు డోలోత్సవము

(ఊంజలసేవ).

9 సోమ రాత్రి 7 గం.లకు నౌకావిహారం (తెప్పోత్సవం)

11 బుధ గురుదశమి,ఉదయం 10 గం.లకు శ్రీసద్గురు పాదపూజ,రాత్రి7 గంటలకుశ్రీ సద్గురు దేవుల మహా పుణ్యారాధన (గురు సాంప్రదాయంలోవారికి)

12 గురు తె.జా 3 గం.లకు శ్రీ సద్గురుదేవులకు రుద్ర, నమక చమక సహిత ఏకాదశ రుద్రమహాభిషేకము. పూజ, మహా మంగళ హారతి, దీక్షావిరమణ,శ్రీసద్గురుదేవుల నగర దర్శనోత్సవము,

**గమనిక:** 12 గురువారం - పెద నింద్రకొలను ఆశ్రమశాఖలో శ్రీ సద్గురు పాదపూజ, భక్త సమారాధన, సత్సంగం, తెప్పోత్సవం.

14 శని శని త్రయోదశి

15 ఆది మాసశివరాత్రి

22 ఆది శ్రీ సుబ్రహ్మణ్యషష్ఠి, శ్రీ సుబ్రహ్మణ్యస్వామివారికి అభిషేకము, సహస్రనామార్చన.

28 శని గీతాజయంతి (సామూహిక గీతా పారాయణము)

**డిశంబరు 2009**

2 బుధ పూర్ణిమ, శ్రీ సద్గురు పాదపూజ,

11 శుక్ర శ్రీ గురుదశమి, సత్సంగం, శ్రీ సద్గురు పాదపూజ.

14 సోమ మాసశివరాత్రి.

**16 బుధ నుండి ధనుర్మాస కార్యక్రమాలు** - ఉదయం 9గం.30 నిలకు సంకీర్తన, 10 గం. లకు తిరుప్పావై, 10గం30 నిలకు ఋషుల చరిత్ర, 11 గం.లకు శ్రీమదాంధ్ర మహాభాగవత ప్రవచనము, ప్రార్థన, తీర్థ ప్రసాదములు.

25 శుక్ర క్రిష్టమస్ - శ్రీసద్గురు పాదపూజ. సత్సంగం.

28 సోమ ముక్కోటి ఏకాదశి, ఉత్తర ద్వార దర్శనము, శ్రీ సద్గురు పాదపూజ, ఏకాహము, భక్త సమారాధన.

# సత్సంగ సౌరభం

-శివ ప్రసాద్

(శ్రీ వీరాంజనేయ స్వామి మరియు శ్రీ నీలకంతేశ్వర స్వామి వారి ఆలయం (కె.పి.హెచ్.బి.కాలని) హైదరాబాదులో ది. 10-8-2009న డా॥ రామతారక పరబ్రహ్మ ప్రసాద్ చేసిన ప్రసంగానికి సంగ్రహ రూపం)

మన సత్సంగ కార్యక్రమంలో ఇది నాల్గవ రోజు - నాలుగు మనస్సు, చిత్తము, బుద్ధి, అహంకారములకు సంకేతము. వీనిని అంతఃకరణము అంటారు. కరణము అంటే కార్యం చేసేదానికి పనికి వచ్చే పనిముట్టు. ఇవి అంతః కరణములు లోపల ఉంటై. వాటి కార్యములు కనబడతై కాని, అవి కనబడవు. కొంతమందిలో బయటకు కనపడేది ఒకటైతే లోపల అనుకొనేది ఇంకొకటి ఉంటుంది. బయటకు కనిపిస్తుంటే బాగు చెయ్యటం వంటివి తేలికగా చెయ్యవచ్చు కాని లోపల ఉండే దానిని బాగు చెయ్యటం అంత తేలిక కాదు.

మనం ఎన్నో పనులు చేస్తుంటాము. కాని పనిముట్లు సరిగా లేకపోతే ఏ పనీ చెయ్యలేము. పనులలో కూడ కొన్ని బయటకు కనపడేవి అయితే కొన్ని బయటకు కనపడవు. కనపడని అంతఃకరణాన్ని మూడు భాగాలు చేయవచ్చు. 1) శరీరము 2) అందులో ఉండే ఇంద్రియములు 3) మనస్సు. ఈ మనస్సు మళ్ళీ నాలుగు భాగాలు 1) మనస్సు, 2) చిత్తము, 3) బుద్ధి 4) అహంకారము. చాలమందికి మిగతావి తెలియక పోయినా మనస్సు తెలుస్తుంది. మనిషి మనస్సు ప్రధానమైనవాడు. స్థిరమైన మనస్సే బుద్ధి. మనందరం అటువంటి బుద్ధిమంతులం కావాలి. చంచలత్వం ఉంటే కోతి బుద్ధి అంటారు. బుద్ధిలో కూడ సద్బుద్ధి, దుర్బుద్ధి అని రెండు రకాలు. సద్బుద్ధి మంచిది. మంచి పనులు చేస్తుంది. దుర్బుద్ధి ఉన్నవాడు చెడ్డ పనులు చేస్తాడు. అందువలన బుద్ధి శుద్ధం కావాలి.

మనం రోజూ పూజ చేసే హనుమంతుణ్ణి బుద్ధిమతాం వరిష్ఠం అన్నారు. వరం అంటే మంచిది, శ్రేష్ఠమైనది అని అర్థం. వరం ఇచ్చాడు అంటే మంచిదాన్ని ఇచ్చాడు అని అర్థం. దానికంటె వరీయం గొప్పది. అన్నిటికంటె గొప్పది వరిష్ఠం. అంటే అన్నిటి కంటె శ్రేష్ఠమైనది. వరిష్ఠుడు అంటె అందరికంటె శ్రేష్ఠుడు, ఉత్తమోత్తముడు. అటువంటి హనుమంతుణ్ణి మనం ఉపాసన చేసేది ఎందుకంటే మన బుద్ధి శుద్ధమై, పవిత్రమై ఉత్తమోత్తమమైనదానిని కోరుకోవటానికి. అంతే కాని పనికి రానివి కోరుకోవటానికి కాదు. అన్నిటి కంటె శ్రేష్ఠం, అందరికి కావలసింది ఏది అంటె అది సుఖం. అది కొద్దిపాటి సుఖం, కొద్ది సేపే ఉండే

సుఖం కాదు. సర్వకాలములయందు ఉండే దానిని కోరుకుంటారు. అయితే అది ఎలా వస్తుంది?

ఏ ఫలితమైనా తను చేస్తేనే వస్తుంది. పని చేయటానికి బుద్ధి కావాలి. శక్తి కావాలి. ఈ రెంటినీ ఇచ్చే శక్తి హనుమంతుడికి ఉన్నది. అన్నింటి కంటె గొప్పది బుద్ధి శక్తి. దానికంటె కొంచెం తక్కువది శరీర శక్తి. కనుక బుద్ధి శక్తి శ్రేష్ఠం. ఆంజనేయుడు బుద్ధిమతాం వరిష్ఠం. అట్టి బుద్ధిమతాం వరిష్ఠుడికి శాశ్వతమైన ఆనందాన్ని ప్రసాదించేవాడు రాముడు. శాంతం, మహానందతనుం, సద్బ్రహ్మవిద్యాధిపం. రాముడు పరమశాంతుడు. మహానందాన్ని ఇచ్చేవాడు. అటువంటి రాముడే హనుమంతుడికి బ్రహ్మవిద్యను ప్రసాదించాడు. శాస్త్ర విద్యను సూర్యుడి వద్దనుండి గ్రహించినా, ఆంజనేయుడు బ్రహ్మ విద్యను రాముని వద్దనుండి గ్రహించాడు. దానితో పరిపూర్ణుడైనాడు. అలా అయిన తరువాత సీతమ్మ రాముడు పరంబ్రహ్మ అని చెప్తుంది. పరిపూర్ణ ఆనంద స్వరూపమైన ఆ తత్త్వాన్ని గ్రహించిన ఆంజనేయుడు. ఆయనను ఆశ్రయించిన వారికి దానిని అనుగ్రహిస్తాడు. రాముడి అనుగ్రహం కావాలి అంటే హనుమంతుణ్ణి ఆశ్రయించాలి. చంచలత్వాన్ని, అల్లరిని మాని బుద్ధి శుద్ధమై పరమానందాన్ని పొందాలి అంటే హనుమంతుణ్ణి ఆశ్రయించాలి. హనుమంతుణ్ణి వేరే ఏవీ కోరుకోకూడదు. ఎదుకంటే ఆయన వేటిని కోరితే అవే ఇస్తాడు. ప్రాకృతమైన వాటిని కోరితే, ఆయన వాటినీ ఇస్తాడు. కానీ అవి నిలవవు. పోతై.

గురుదేవుణ్ణి ఆశ్రయించి ఉంటే హనుమంతుని వలె అవుతారు. చాలమంది గురువు అంటే తెలియక ఏదో చదువు చెప్పే ఉపాధ్యాయుడే గురువు అనుకుంటారు. గురు అంటే శబ్దకోశంలో 36 అర్థాలున్నై. ముఖ్యమైన అర్థం జ్ఞాన బోధ చేసే వాడు అని. ఆత్మ అంటే తాను. తానెవరో తెలియకపోతే మిగతావన్నీ పనికిరావు.

నీవు ఎవరు? అంటే చెప్పగలగాలి. ఇది ఎవరి ఇల్లు? ఇది నా ఇల్లు, నీవు ఎవరు? ఎవరో తెలియదు. వాళ్ళు ఆత్మజ్ఞాన విమూఢులని శంకరులు చెప్తారు. ఆత్మజ్ఞానం అంటే తన యొక్క స్వరూపానుభూతి. నేను, నాది అనే రెండు శబ్దాలున్నాయి. నాది అనే దానికే మమకారం అని పేరు. దీని మూలం అహం. ఆ అహం ఏదో తెలియక ఇంకొకదాన్ని అహం అనుకుంటే అది అహంకారం. అంతేకాని అది అహం కాదు. అందరూ చేసేది అదే. తాను కాని దానిని తాను అనుకుంటారు. అందరూ అక్కడ తప్పు చేస్తున్నారు. అందువలన బాధలు, కష్టాలు వస్తున్నై.

-సశేషం

# విధివిలాసంలో భగవన్నివాసం

-యన్. లక్ష్మి

దైనందిన జీవితంలో రాగ-విరాగాలు, సుఖ-భోగాలు, కష్ట-సుఖాలు, ఇష్టాZయిష్టాలు - మొదలైన ద్వంద్వాలలో కొట్టు మిట్టాడుతూ - సుడిగుళ్ళు పడుతూ - సంసార సాగరంలో నిమగ్నమైన సాధారణ జీవులైన మనందరినీ ఉద్ధరించటానికి భగవానుడు కూడా చిత్ర - విచిత్ర చర్యలతో - రూపాలతో ప్రవర్తించి మనలోనే ఉండి మనంగా ఉండి మనస్సునీ, తనువునీ కూడా ప్రకాశింపచేస్తూ ఉన్న గురుమూర్తిని గుర్తించటానికి సాధకులు - సిద్ధులు - యోగులు - గురువులు - మనకి మార్గదర్శకులై గుర్తింప జేస్తూనే ఉన్నారు - ఆ ప్రయత్నంలోనే యీ ఒడిదుడుకులన్నీ అందరికీ జన్మ సిద్ధంగా సహజమేననీ వీటిని దాటటం (అధిగమించటం) మన ఆలోచనపైనే ఆధారపడి ఉన్నదనీ ధైర్యాన్నీ - ఉత్సాహాన్నీ కలిగించటం కోసం ఆ భగవానుడినే ఉదాహరణగా చూపిస్తూ మనని నిడిపిస్తుంటారు.

అన్నమాచార్య భగవంతుని చిత్ర - విచిత్ర చర్యలని ఆశ్చర్యంతో ఆనందంగా ఎలా కీర్తిస్తూ ఉన్నారో ! చూడండి. అసలు ఈ సంసార లంపటానికి కారణాన్ని మూలాన్ని అవలోకిస్తూ.

**"తన కర్మవశం యించుక - దైవకృతంబొకయించుక**
**మనను వికారంబించుక - మానదు ప్రాణులకు''**

-అంటున్నారు.

పూర్వ జన్మలలో మనం చేసి పెట్టుకున్న కర్మ వలన కొంత, ఈ కర్మరాహిత్యం చేసే క్రియలో భాగంగా భగవానుడు ప్రణాళిక ప్రకారంగా ఈ జన్మలో - యింత ఆయుర్దాయం - అందులో యీ -యీ - కర్మఫలానుభవం అంటూ సిద్ధం చేసి మనచేత అనుభవింపజేసే దైవకృతం కొంత - ఆ కారణాలకనుగుణంగా మార్పు చెందే మానసిక వికారాల వల్ల ఈ సంసార లంపటం తప్పదు - అంటూనే మరలా విధిని స్మరిస్తూ - ఎంత చెయ్యలేదయా? విధి ! ఎవరిని కనికరించింది గనక? "అభవునంతటి వానిని భిక్షమడుగుకొనగజేసె'' అంటారు.

పుట్టుకే లేని ఆది మధ్యాంత రహితుడూ - అనాదియైన

ఈశ్వరుడినే భిక్షకుడిగా మార్చింది. చంద్రుడు? చంద్రుడు ఎంత గొప్పవాడు? అమ్మ - జగన్మాత లక్ష్మీదేవితో పాలసముద్రంలో ఉద్భవించి - లోకాల మామ చందమామయై ఆ ఈశ్వరుడికే ఆభరణంగా ఆయన శిరస్సుని స్థానంగా పొందాడు కదా ! అటువంటి చంద్రుడిని "గురుతల్పగతుడు"గా మార్చింది విధి కాదూ? దేవేంద్రుడు ! త్రిలోకాధిపతి - ఇంద్రభోగాలనుభవించే - ఇంద్రుడు - నూరు అశ్వమేధ యాగాలు యధావిధిగా ఆచరించి ఆ ఫలంగా ఇంద్రపదవిని అధిష్ఠించినవాడు. మనశ్శరీరాలని దృఢ సంకల్పంతో అరికట్టి ఎంత నిష్ఠగా ఉండి ఉంటాడు? అటువంటి నిష్ఠాగరిష్ఠుడిని - ఆయన అనుభవించే స్వర్గసుఖాలలో ఏ పాటిది? స్త్రీ లోలత్వం? అందుకు మహేంద్రుడినే 'కోడి'గా మార్చింది విధి. ఎక్కడి - ఎంతటి ఇంద్రుడు? ఎక్కడి కోడి - విధి కాకపోతే ఏమిటయా? త్రిశంకుమహారాజు అంతటి మహారాజూ అంత్యజుడయ్యాడే? విధిమహిమ కదూ! నలమహారాజు? నాలుగు పాదాలా ధర్మాన్ని తప్పకుండా నడిపిన నలమహారాజు ఎంత వికృత స్థితి పొందాడు? ధర్మరాజు? సాక్షాత్తూ ధర్మమూర్తి, యమధర్మరాజు సమవర్తి కదా ! అట్టి ధర్మరాజు జూదవ్యసనానికి బానిసయై పతివ్రతయైన భార్యని పణంగా పెట్టాడే? మానవులెంతయ్యా విధి వ్రాతముందు? పడరాని కష్టాలుపడి సత్యం కోసం భార్యాబిడ్డలనీ - తుదకు తననితాను అమ్ముకొని కాటికాపరిగా నిలచిన హరిశ్చంద్రుడు? విధికి తలవంచలేదా? అభిమానవంతుడూ - మహా పరాక్రమవంతుడూ అయిన రారాజు దుర్యోధనుడు మడుగున దాగవలసి రావటం? హతవిధీ. విధి బలీయమే కదా? ఆ విధి బ్రహ్మని మాత్రం వదిలిందా? ఆయనా తలవదులు కోవలసి వచ్చింది కదా? అయ్యా - ఆ వేంకటేశ్వరుని కృప పొందలేకపోతే ఎంతటి వారికైనా భంగపాటు తప్పదు. అందరూ విధికి తలవంచ వలసిందే అంటూనే అన్నమాచార్యులవారంటారూ! 'ఏమయ్యా స్వామీ ! నీ పనులన్నీ చోద్యంగాను - వింతగానూ ఉంటాయ్! అన్నీ వింతలూ - విడ్డూరాలూనూ - మోకాలుకీ - బోడిగుండుకీ ముడి బెట్టినట్టుందేమయ్యా అర్థంగాదు! నీ పనులేంటి? వరాహావతారంలో భూమిని చొచ్చుకుని ఆడుగుభాగానికి

వెళ్ళావా? మళ్ళీ వామనావతారంతో ఆకాశాన్నంటావా? గజరాజుని కరుణాంతరంగుడవై "ధమ్మిల్లము చక్కనొత్తక'' ఒక్క ఉదుటున వచ్చావా? కాపాడటానికి అంతలో నారసింహావతారంతో మహాక్రోధోద్రిక్తుడవై, ప్రళయ గర్జనతో భీకరంగా రాక్షస సంహారం చేశావా ? నువ్వు విశ్రాంతి తీసుకునేది నాగశయనమా? మరి వాహనంగా "ఆపామిడి'' తురగమేంటి? పాము+ఇడి అంటే పాములకి శత్రువని కదా ! గరుడ వాహనారూఢుడివా? వింతగా లేదూ ! భోగ శయనుడవై పురుషోత్తముడైన నీవే కదా ! అమృతం పంచేటప్పుడు తరుణిగా మారలేదా? ఇది విధి వ్రాతయేనా? ఆయింద్రుడికి ఇంద్ర పదవిని అనుగ్రహించడమేకాక ఆ పదవిని నిలపటానికి నువ్వు వటువు వేషంతో భిక్షాటన చేశావు గదా! "యోగక్షేమం వహామ్యహం'' అంటూ ఎన్ని తంటాలు పడ్డావయ్యా ! ఆ ఇంద్రుడికి తమ్ముడివనీ ఉపేంద్రుడివనీ చెప్పుకుంటున్నావా? ఏంటయ్యా బాబూ ఈ చిత్రవిచిత్రాలు?

అయ్యా వేంకటా చలపతీ ! వేంకటాచలంలో తిరుమల గిరులలో వేంచేసి కొండలపై నెలకొన్న నీవు - మళ్ళీ "సర్వహీన స్వరూపోహం'' అంటూ క్రిమికీటకాదులలో సైతం చరాచర జగత్తులలోనూ అంతర్యామిగా ఉన్నావా? "హృద్దేశేర్జున తిష్ఠతి'' అన్నావు గదయ్యా! ఎక్కడయ్యా నీ నివాసం? గుళ్ళోనా? గుండెల్లోనా? మేమేమో! గుళ్ళల్లోనో దేవుడి గూట్లోనో, పుణ్యక్షేత్రాల్లోనో నీకోసం వెతుకుతున్నాం. అంతరాత్మగా అంతర్యామిగా - అంతరారాముడుగా - హృదయ బాబుగా మాలోనే నెలకొన్న నిన్ను గుర్తింపజేయటానికి అహర్నిశలు సోzహం - సోzహం అంటూ హెచ్చరిస్తూనే ఉన్నావు. క్షణం నిలచి మనసుపెట్టి చూస్తే అవగతమౌతుందేమో! తెలియలేక పోతున్నాం - "అన్నింట నీ రూపముగన ఈడులేని తెలివీయగదే'' అని ప్రార్థిస్తున్నాడు అన్నమయ్య. మేమూ అంతేనయ్యా నేనంటే నువ్వయ్యా! నువ్వుంటేనే నేనయ్యా'' అని అనుభవపూర్వకంగా తెలుసుకొని ఆనందించే అనుభవజ్ఞానాన్ని ప్రసాదించ వలసిందిగా ప్రసాదదేవుని ప్రార్థిస్తూ -*

# 'ఒక పిలుపు చాలు'

-వారణాసి అమరేశ్వర శాస్త్రి

1975 వ సం॥రంలో నేను, వేదాంతం జగన్నాథ శర్మ, ఉమాభారతి వాళ్ళ నాట్యబృందంలో మృదంగం, తబలా వాద్య కళాకారునిగా ఆఫ్రికా, డర్బాన్ వెళ్ళాను. అక్కడ కార్యక్రమం విజయవంతంగా పూర్తి చేసుకుని మేమంతా తిరుగు ప్రయాణమైనాము. మేము ఎక్కిన విమానం ప్రయాణం సాగిస్తుండగా కొంత సమయానికి ఒక ప్రక్క రెక్క కాలిపోవటం మొదలు పెట్టింది. అందువలన విమానం ఒక వైపు ఒరిగి మేఘాలలో దూసుకుంటూ పోతున్నది. క్రింద మహా సముద్రం!

పైలట్ ప్రమాదాన్ని గుర్తించి అందర్నీ బెల్టులవీ కట్టుకోమన్నాడు. ఆకాశంలో విమానం క్రిందకి క్రిందకి ఇంకా క్రిందికి దిగిపోతున్నది. అందర్నీ ప్రాణభీతి ఆవరించింది. అరి చేతుల్లో ప్రాణాలు పెట్టుకున్నాము. పైలట్ విమానాన్ని జాగ్రత్తగా మళ్ళిస్తూ రక్షణకి ప్రయత్నం చేస్తూ చివరికి షసేల్స్ అనే ద్వీపానికి చేరువగా తీసుకెళ్ళాడు. అప్పటికే పడిపోతున్న విమానం స్పీడుగా నేలకేసి దిగుతున్నది. అప్రయత్నంగా 'బాబూ!' అని పెద్దగా కేక వేసి భయంతో కళ్ళు గట్టిగా మూసుకున్నాను. కళ్ళు తెరిచే సరికి విమానం క్షేమంగా దిగి అక్కడున్న ఇసుకలో కూరుపోయి ఆగింది. నా ప్రక్కనే కూర్చుని ఉన్న జగన్నాథ శర్మ 'అంతగావుకేక పెట్టావేమిటి?'' అన్నాడు. 'ఆపదలో ఆదుకునే సమర్థులైన మా గురుమూర్తిని తల్చుకున్నాను అంతే!'' అన్నాను. 'విహ్వాల నాగేంద్రము పాహి పాహియన కుయ్యాలించి' న గజరాజరక్షకుడు అక్కడ తన అభయ హస్తాన్ని అందించినందువల్లగాని, లేకపోతే ప్రక్కనున్న సముద్రంలో విమానం కూలిపోయి అందరం అందులోని షార్క్ చేపలకు ఆహారం అయి ఉండేవాళ్ళం. ఆ పైలట్ రూపంలో సురక్షితంగా ద్వీపానికి చేర్చి 300మంది ప్రాణాలు కాపాడినది గురుమూర్తే.

ఆ ద్వీపంలో వారం రోజులున్నాము. ఢిల్లీనుంచి విమానం పంపటానికి వీలులేక, బొంబాయి నించి విమానం వచ్చేదాకా ఆ ద్వీపంలో ఆగిపోవలసి వచ్చింది. షసేల్స్‌లో కొబ్బరి చెట్లు, ఇంకా ఏవో చెట్లున్నాయి. వసతి సౌకర్యాలేమీ లేవు. నేలమీదంతా మండ్రగబ్బలు, తేళ్ళు ఎక్కువగా ఉన్నాయి. చిన్న చిన్న గుడారాలు ఏదో రెల్లు గడ్డి పరచి కట్టి, అందులో నాలుగేసి స్తంభాలమీద ఒక

బల్ల వేసి అదే బెంచీ మంచంలాగ ఏర్పాటు చేశారు. ప్రక్కనున్న మారిషస్ ద్వీపం నుంచి మధ్య మధ్య మరబోట్లు వస్తుండేవి. వాటిలో ఆహార పదార్థాలు, బట్టలు వచ్చేవి. మాంసాహారులకి చేపలు మాంసం పుష్కలంగా ఉన్నా, మా శాకాహారులకి మాత్రం తిండి సరైనది లభించలేదు. బ్రెడ్, పాలు, జొన్న రవ్వ లాంటివేవో దొరికితే అదే తిని కడుపు నింపుకున్నాము ఆ వారం రోజులూను. మారిషస్ ప్రెసిడెంటు రామ్ గులామ్ అనే ఉత్తముడు మా విషయంలో ఎంతో శ్రద్ధ తీసుకున్నాడు. తిరిగి వచ్చేముందు వారింట్లో మా నాట్య ప్రదర్శన ఏర్పాటు చేశాడు. బొంబాయి నుంచి వచ్చిన విమానంలో క్షేమంగా హైదరాబాద్ వచ్చాము.

ఇక్కడ ఆశ్రమంలో మా అమ్మ ఉంది. ఈ సంఘటన జరిగిన రోజన శ్రీబాబు ఆవిడని పిలిచి 'మీ అబ్బాయి పెద్ద ప్రమాదంలో చిక్కుకుని బాబూ! అని కేక పెట్టాడు. అది నాకు వినబడింది. మరి రక్షించక తప్పలేదు అన్నారట. తరువాత నేను ఆశ్రమానికి వచ్చి స్వామి దర్శనం చేసుకున్నప్పుడు జరిగిందంతా విన్నవించుకున్నాను. "నాకు అంతా తెలుసులేవయ్యా! నీ పిలుపు నాకు వినబడిందిలే" అన్నారు బాబు.

భగవంతుని కన్నూ, చెవి, మనసూ చాలా పెద్దవి. అవి విశ్వ వ్యాప్తమై ఉన్నాయి. దీనుల ఆర్తనాదమూ, ఆశ్రితుల ఆపత్సమయమూ గుర్తించి, ఆకర్ణించి సమయానికి తగిన రక్షణ అందించే వాత్సల్య పూరిత హృదయమూ నమ్మినవారి సొమ్మయిన జగన్నాథుని సొత్తు. *

ఆగామి, ప్రతిబంధము అనగా భావి ప్రతిబంధము. జన్మాంతరమునకు హేతుభూతమగు ప్రారబ్ధావశేషము. అది అనుభవించనిదే క్షీణించదు. దృఢమగు శ్రవణాదుల ద్వారా అది ఒకటి రెండు జన్మములయందు క్షీణించును. లేనిచో అనేక జన్మలను ఎత్తవలసి వచ్చును. ఉదాహరణమునకు వామదేవుని ప్రారబ్ధము ఒక జన్మమునందు క్షీణించెను. ఒక జన్మ అయినను పొంది తీరవలసివచ్చెనన్నది నిస్సంశయము. కర్మమును అనుభవించనిదే ప్రారబ్ధము నశించదు. అదే విధముగా భరతునకు మూడు జన్మముల అనంతరము ప్రారబ్ధము క్షయమును పొందెను.

భరతుడు మూడు జన్మలను పొందుటకు గల కారణము సాంఖ్యసూత్రములయందు ఉన్నది. - వార్తాలాపము

# శ్రీ గురుమూర్తి లీల

-తణికెళ్ళ వేణు

పోతునూరులో శ్రీ బాబు 3 సంత్సరములు నవరాత్రులు చేశారు. అమ్మ పూజకు కావలసిన వన్నీ సమకూర్చి సర్దుకునే సేవను శ్రీబాబు నాకు ప్రసాదించారు. అలా అమ్మ సేవ, బాబు సేవ చేసుకొనే దాన్ని. అలా పోతునూరులో 3 సంవత్సరములు పూర్తయ్యాక గుండుగొలనులో భోగరాజుగారింట్లో దేవీ నవరాత్రులు చేసేవారు. అప్పటికి నాకు వివాహము అయి 4 సంవత్సరములు అయింది. మేము మావారి ఉద్యోగ రీత్యా బొబ్బిలిలో (శ్రీకాకుళం జిల్లా) ఉండేవాళ్ళం. మాకు ఒక బాబు. పేరు కాళీ ప్రసాదు. 1961 వ సంవత్సరంలో గుండుగొలనులో దేవీ నవరాత్రులకు ఒక రోజు ముందు మా బాబును తీసుకొని వచ్చాను. నేను వచ్చే సరికే శ్రీబాబు వచ్చి ఉన్నారు. ప్రారంభము రోజున నేను, చిట్టి అనే ఆమె అమ్మ పూజకు కావలసినవి సర్ది ఉంచాము. శ్రీబాబు కలశస్థాపన చేసి పూజలోకి వెళ్ళారు. సంకీర్తన జరుగుతోంది. పూజ పూర్తయ్యాక తీర్థ ప్రసాదములు, మహా ప్రసాదము పూర్తయ్యాయి. శ్రీబాబూ, మేమూ కూర్చొని ఉన్నాము. బాబు నవరాత్రులకు భీమవరం నుండే వచ్చారు. ఈ విషయం బాబు నాతో చెప్పారు. కానీ భీమవరం నుండి భక్తులు ఎవరూ గుండుగొలను రాలేదు. భీమవరం తాతయ్యగారి కోడలు చంపక, నేను, ఎప్పుడూ మొదటి రోజుకే వచ్చి ఉండేవాళ్ళం. అటువంటిది, చంపక కూడా రాలేదు. నేను బాబుని అడిగాను "బాబు చంపక రాలేదేమిటి?" అని. "వస్తుందిలే తొందరేమిటి?" అన్నారు. అదేమిటి బాబూ అలా అంటారు. అది రాకపోతే నాకు చాలా వెలితిగా ఉంది. ఎప్పుడూ ఇద్దరం కలిసి ఉంటాము గదా అన్నా. వస్తుందిలే అని చిరునవ్వుతో మాట మార్చేశారు. అలా 3 రోజులు గడిచాయి. ప్రతీ కార్యక్రమము ఎంతో ఆనందంగా జరుగుతోంది. ఏ ఒక్కరూ భీమవరం నుండి రాలేదు. నేను బాబును ప్రతీ పూట అడుగుతూనే ఉన్నా. నవ్వి మాట తప్పించటమేకాని సరైన

సమాధానము చెప్పటం లేదు. 4వరోజు కూడా పూజ గదిలో పని పూర్తి చేసుకొని బాబు దగ్గరకు వచ్చాను. ఏమిటి బాబూ? చంపకకైతే ఏదైనా ఇబ్బంది రావచ్చు, అందరూ ఎందుకు రాలేదు చెప్పండి బాబూ, మాట తప్పించద్దు. ఏం జరిగింది చెప్పండి అని మరీ మరీ ప్రార్థించా. మళ్ళీ శ్రీబాబు నవ్వుతూ నీ కెందుకు అంత తపన వాళ్ళు రాకపోతే, కారణం ఊహించి నువ్వు చెప్పు అన్నారు. బాబూ మీకు తెలియదా! అందరం ఎంతో ఆనందంగా గడిపేవాళ్ళము. ఆ ఆనందం మిస్సయ్యాము. అందరం కలిసి పంచుకొన్న ఆనందం, ఒకరికి ఒకరు చెప్పుకొంటూ ఉంటే, దాన్ని వర్ణించుకోగలమా. బాబూ నాకు మాత్రం వాళ్ళు రాలేదని చాలా బాధగా ఉంది. చెప్పండి బాబూ అన్నాను. అదా సంగతి. వీణ్ణి గురించి చెప్పుకోవాలనా (అంటే తనను గురించి, చెప్పిన బోధను, అందరం మళ్ళీ మళ్ళీ చెప్పుకొని ఆనందించే వాళ్ళం). ఈ రోజు వస్తారులే అన్నారు. రోజూ అలాగే చెబుతున్నారు. అప్పుడే 3 రోజులు అయిపోయాయి, నాలుగవ రోజు కూడ వచ్చేసింది. ఇంకా రాలేదు అంటుండగా ఎవరో వచ్చి భీమవరం నుండి తాతయ్యగారి కుటుంబం వచ్చింది, చెల్లాయమ్మగారు, రాజమ్మగారు, అన్నపూర్ణమ్మగారు, లక్ష్మీదేవమ్మగారు, సత్యం, సుబ్బారాయుడుగారు అందరూ వచ్చారు అన్నాడు. శ్రీబాబు అలాగా! వచ్చారా! అన్నారు నవ్వుతూ. శ్రీబాబుకు వాళ్ళంతా నమస్కారము చేసుకొన్నాక, శ్రీబాబు పూజలోకి వెళ్ళిపోయారు. వెళ్తూ వెళ్తూ నాకేసి చూసి నవ్వినట్లనిపించింది.

నేను సంగతేమిటో వివరంగా తెలుసు కొందామని బయటకు వచ్చాను. చంపకతో ఏమిటే నవరాత్రులలో 3 రోజులు అయిపోయేదాక రాకుండా ఎలా ఉన్నారు? ఏం పనులు దొర్లిస్తున్నావు? నువ్వయినా రావచ్చుగదా! నేను రోజూ బాబును అడుగుతుంటే సరిగ్గా చెప్పకుండా దాటేస్తున్నారు. నవ్వుతూ,వస్తారులే ఏమిటి తొందర నువ్వున్నావుగా అంటున్నారు. ఈ ఆనందాన్ని అందరం పంచుకోలేక పోతున్నామని

ఒకటే బాధ. అసలు సంగతి చెప్పు, ఎదుకు రాలేదు? అన్నాను. నీకో ఆనందమైన విషయం చెప్పనా అంది. చెప్పు, చెప్పు అని తొందర చేశా. శ్రీబాబు 10 రోజుల నుండీ అక్కడే ఉన్నారే. బాబు రాత్రే బయల్దేరి వచ్చారు. మేమంతా ఉదయం ఫస్ట్ బస్సుకు బయల్దేరాం అంది. పిచ్చి కబుర్లు చెప్పకు. బాబు నవరాత్రులకు 4 రోజులముందే ఇక్కడకు వచ్చి నవరాత్రులకు ఒకరోజు ముందుగా రమ్మని నాకు ఫోన్ చేయించారు. నన్ను వెంటనే రైలెక్కించారు మా బావ అన్నాను. నేను ముందు రోజు ఉదయమే వచ్చాను నేను. వచ్చే సరికి నీవు ఇంకా రాలేదు. బాబును పూట పూట అడుగుతూనే ఉన్నాను. కోతలు కొయ్యకు. అబద్దాలు చెప్పకు అన్నాను. నిజమేనే ఒట్టు, బాబు రాత్రే అమ్మ పీఠం తీసుకొని బయల్దేరారు. అక్కడ చెల్లాయికి (రమణ ప్రసాద్ తల్లి) చాలా సీరియస్‌గా ఉంది. బాబు రోజూ తీర్థం, ప్రసాదం ఇస్తూ రెండు వేళలా చూస్తున్నారు. మేమంతా కూడా అనుకొన్నాం, కానీ నవరాత్రుల సంగతే మర్చిపోయాం, బాబు సమక్షంలో ఆనందాన్ని పొందుతూ. చెల్లాయికి కొంచెం తగ్గింది. నవ రాత్రులు కదా నేను బయల్దేరుతున్నా మీరంతా రేపురండి, అంటూ అమ్మను తీసుకొని వచ్చేశారు. అని చెప్పింది. ఇది విని శ్రీబాబు సర్వ వ్యాపకులని తెలిసి కూడా ఒక క్షణం ఉబ్బి, తబ్బిబ్బై, అమ్మ దొంగా! ఇదా సంగతి చెప్పకుండా ఎంత మాట తప్పించారనుకొన్నావు. అని చెప్తూ, "ఇందుగల దండులేదని సందేహము వలదు చక్రి" అదే పద్యాన్ని చదువుకొంటూ, బాబు అక్కడ ఉన్నప్పటి కబుర్లు చెప్పుకొంటూ ఆనందందా ఉండగా, మా నాన్నగారు పరిమి సుబ్రహ్మణ్య భాగవతార్ వచ్చారు. నాన్నగారితో ఈ సంగతి చెప్పాం. ఎంతో ఆనందంగా ఆనందబాష్పాలు రాలుస్తూ అలా ఉండిపోయారు. వెంటనే కాగితం కలం తీసుకొని బాబు యొక్క సర్వ వ్యాపకత్వాన్ని వర్ణిస్తూ నవరత్నాలను (పద్యాలను) వ్రాశారు. *

# వైష్ణోదేవి (ఉత్తర దేశ) యాత్రలో చిన్న అనుభవం

-పి. సుధారాణి

ఉత్తర దేశ యాత్రలో మాతాజీతో కలిసి మొట్ట మొదట వైష్ణవీ దేవి ఆలయానికి బయలు దేరాము. యాత్ర అంటే యాతన అని అమ్మ ముందే చెప్పారు కాబట్టి కొంచెం మనస్సును సిద్ధం చేసుకునే ఉన్నాను. నడుద్దామని బయలు దేరాను కానీ నడవలేక కొంచెం దూరం వెళ్ళాక గుఱ్ఱం ఎక్కాను.**3 1/2** గంటలు గుఱ్ఱం మీద ప్రయాణం. ఒక్క ప్రక్క ఎత్తైన కొండ ఇంకో ప్రక్క లోయ. చీకటి పడింది. చలి మొదలైంది. సన్నగా ఉన్న రోడ్డుపైన నడిచే జనం రద్దీ, గుఱ్ఱాలు, డోలీల రద్దీ. గుఱ్ఱాన్ని హింసించి, దానిపై ఎక్కినందుకు, వచ్చే జన్మలో నేను గుఱ్ఱమై పుట్టి, గుఱ్ఱాన్ని మోయాలేమోనని బాధ. గుఱ్ఱపు స్వారీ అలవాటులేక నడుము క్రింద భాగం విపరీతమైన నొప్పి. గుఱ్ఱం మాట వినకుండా అటూ, ఇటూ పరిగెత్తుతున్నది. అన్నీ కలిసి చాలా భయం వేసింది. ప్రాణభయం కాదు. నిజంగా నా ఆయుష్షుతీరి, శరీరాన్ని వదలవలిసి వస్తే, పుణ్య క్షేత్రంలో అనాయాస మరణం కలగడం ఎంతో అదృష్టం. కానీ మాతాజీకి చెడ్డ పేరు రాకూడదు కదా! ఆ భయం పోగొట్టుకోడానికి గురు నారాయణ మంత్రం జపం చేయడం మొదలు పెట్టాను. వెళ్ళేటప్పుడు 3 గంటలు తిరిగి వచ్చేటప్పుడు 2 గంటలు, నిశ్చల మనస్సుతో, తదేకాగ్రతతో నామ జపం జరిగిపోయింది. అమ్మ గురు నారాయణ మంత్రం ఇచ్చినప్పటినుండీ రోజూ 2 గంటలైనా జపం చేస్తున్నాను కానీ, ఇంత ఏకాగ్రత ఎప్పుడూ కుదరలేదు. ప్రతిరోజూ ధ్యానం చేసుకుంటున్నప్పటికీ, 5 నిమిషాలు కూడా మనస్సు కుదురుగా ఉండటం లేదని బాధ పడుతుంటానే. మరి ఇన్ని గంటలు ఏకాగ్రత ఎలా కుదిరింది? ఎప్పటికీ అలా కుదరాలంటే ఏం చెయ్యాలి? ఇలాంటి జీవన్మరణ సమస్య వస్తే తప్ప మనస్సు నిలవదా? అలాంటి సమస్య నిత్యం రావాలని (కుంతీదేవిలాగ) మనము కోరుకోము కదా! ఎక్కువ కష్టాలు లేకుండా, జీవితం సాఫీగా సాగిపోవాలనీ, అనారోగ్యం పాలవకుండా, చివరికి గురు సాయుజ్యం పొందాలనీ, అందరం కోరుకుంటాము కదా! మరి ప్రపంచంలో ఉంటూ, ధనార్జన చేస్తూ, సుఖాలు అనుభవిస్తూ ఆరోగ్యంగా ఉన్న వారి పరిస్థితుల్లో కూడా, గుఱ్ఱం మీద కూర్చునప్పుడు కలిగిన ఏకాగ్రత కలగాలంటే ఏం చెయ్యాలి? ఇలాంటి విచారణ చెయ్యాలని కూడా గుఱ్ఱం మీద కూర్చునప్పుడు అనిపించలేదు. నిరంతర నామస్మరణ తప్ప ఇంకొక ధ్యాస లేదు. బాబూజీ చెప్పినట్లు నామానికీ, నామానికీ మధ్య ఎడం లేకుండా, తైల ధారలాగ నామ స్మరణ జరిగితే, మాయ చొరబడే

అవకాశం లేదుకదా! ఇలా విచారణ చేశాక నా కనిపించిందేమిటంటే, మనస్సు అనే గుఱ్ఱం, మాయ అనే లోయలోకి ఎక్కడ పడవేస్తుందోన్న భయం దృఢంగా ఉంటే, ఎంత ప్రపంచంలో తిరుగుతున్నా, మనస్సు, గురుపాదములందు స్థిరంగా నిలవగలుగుతుంది. ఈ యాత్ర అనుభవం నేర్పిన పాఠం జీవితాంతం మరువకుండా ఉండగలిగే స్థిరమైన మనస్సును, ఇవ్వమని సద్గురు దేవులను ప్రార్థిస్తూ!

*

ఒక గ్రామమున ఒక వ్యాపారి యుండెను. అతడు పప్పు దినుసులు అమ్మెడివాడు. వడ్డీ వ్యాపారముకూడా కలదు. జనులందరు అతనిని భక్తుడు అని పిలిచెడివారు. ఈ భక్తుడు చాలా నమ్మకమైనవాడు. అతని వద్దనే అందరును తమకు కావలసిన సామానులన్నియు తీసికొనెడివారు. అతని వ్యాపారము చాలా మిక్కుటముగా సాగెడిది. ఆ గ్రామమునందలి ఒకానొక వ్యక్తి వ్యాపారము చేయుటకు ఇతర దేశములకు వెళ్ళెను. భర్త లేని రోజులలో భార్య ఈ భక్తుని దుకాణము మీదనే సరకులు అన్నియు తీసికొనెడిది. కొన్ని రోజుల తర్వాత అతడు ఇతర దేశమునుండి తాను సంపాదించిన ద్రవ్యముతో ఇంటికి వచ్చెను. అక్కడ తనతో ఒక వేయి కాసులు కూడ తీసికొని వచ్చియుండెను. వాని నాణ్యమును విలువ కట్టించుటకు అతడు మన భక్తుని వద్దకు తీసికొని వచ్చెను. భక్తుడు లెక్కపెట్టి అందులో రెండు కాసులు తక్కువ అని చెప్పెను.

పరదేశమునుండి వచ్చిన వ్యక్తి పలికెను. నేను వెయ్యి బంగారు కాసులు తెచ్చితిని. తక్కువ ఎట్లుండును? ఇట్లని అతడు కోపముతో భక్తుని డబ్బు పెట్టెను లాగి చొక్కా వెతికెను. ఆ పెట్టెలో రెండు కాసులు ఉండెను. అంతట అతడు బిగ్గరగా అరచి చెప్పసాగెను. “దొంగ,దొంగ.” అతడు అందరను ప్రోగుచేసి ఆలోచించకుండ ఆ భక్తుని తిట్టుచు ఇట్లు చెప్పసాగెను. చూడండయ్యా! భక్తాగ్రేసరుడట! భక్తులంటే ఇల్లాగా ఉండవలెను? గ్రామమంతా తెలిసిపోయెను. ఇంతలో ఈ వార్త పరదేశమునుండి వచ్చినవాని భార్యకు తెలిసెను. ఆమె ఒక నౌకరు ద్వారా ఇట్లు కబురు పంపెను. ఆ భక్తుడు దొంగ కాడు. మీరు లేనప్పుడు ఇంటికి కావలసిన సామానులన్నియు మేము అతని వద్ద తీసికొంటిమి. వారికి డబ్బు ఇవ్వవలసియుండెను. కావున మీరు తెచ్చిన వెయ్యి కాసులలోనుండి రెండు కాసులు అతనికి ఇచ్చితిమి. ఇది వినినతోడనే అతనికి చాలా పశ్చాత్తాపము కలిగెను. అతడు భక్తుని క్షమించమని ప్రార్థించెను. అంతవరకు తిట్టుచున్న ఇతరులుకూడ భక్తుని స్తుతించసాగిరి. భక్తుడు భక్తుడే అనిరి.

జనులు ఇటులనే ఆలోచించకుండ మాట్లాడెదరు. వెనుక ముందులు చూడకుండ నిందించెదరు. - వార్తాలాపము

# గురుదేవులు చెప్పింది చెప్పినట్లు వినకపోతే...

-జగదీష్

సెయింట్ లూయిస్‌లో 15 రోజులు అమ్మ సన్నిధిలో గడిపాక, నా శ్రీమతికి మా చిన్నబ్బాయి జ్ఞాపకమొచ్చి, వాడిని చూడాలన్న బాధ మొదలైంది. “ఏవండీ చిన్నబ్బాయి దగ్గరకు వెళ్ళడానికి మాతాజీవారిని అనుమతించమని అడగండి'' అని ఒకటే పోరు పెట్టింది. ఇక తప్పనిసరై అయిష్టంగానే మాతాజీవారికి మా ఆవిడ కోరిక విన్నవించుకున్నాను. దానికి మాతాజీగారు తొలి ఏకాదశి పూజలు ఇక్కడ జరుపుకొని తరువాత వెళ్ళుదురులే అన్నారు. నేను అమ్మ చెప్పింది మా ఆవిడకు చెప్పి నచ్చచెప్పడానికి ప్రయత్నించాను. కాని ఆమె వింటేనా. రెండు రోజుల తరువాత మళ్ళీ మొదలు పెట్టింది “అమ్మని అడగండి'' అంటూ. నేను కాస్త విసుక్కుంటూనే 'నీవే వెళ్ళి అడుగు, ఎందుకంటె నేనడగటమూ, మాతాజీవారు జవాబు చెప్పటమూ ఇదివరకే అయిపోయింది' అని గట్టిగా చెప్పాను. అయినా మా ఆవిడ ఆ విషయాన్ని అంతటితో వదలలేదు. భయపడుతూ భయపడుతూ మాతాజీగారి వద్దకు వెళ్ళి తన ఆవేదన అంతా వెళ్ళబోసుకుంది. గురుదేవులు ఎప్పుడూ చెప్తుంటారు, 'నాదేమో తెలిసినబాధ, మీదేమో తెలియని బాధ' అని. అయినా మాతాజీవారు తెలిసిన బాధతోనే కేవలం నా భార్యను నిరాశ పరచటం ఇష్టంలేక వెళ్ళడానికి అనుమతించారు. మా ఆవిడ ఒంటరిగా వెళ్ళడం కష్టము. ఎందుకంటే మధ్యలో విమానం మారవలసి ఉంటుంది కనుక. ఆమె అవస్థ గమనించి, మాతాజీవారు నన్ను కూడ ఆమెకు తోడుగా వెళ్ళమన్నారు. మర్నాడు మాకు వీడ్కోలు ఇవ్వటానికి అమ్మ విమానాశ్రయానికి వచ్చారు. ఆ రోజు నేను దూడను ఆవునుంచి వేరుచేస్తున్నట్లుగా ఎంతో బాధ పడ్డాను.

సెయింట్ లూయిస్ విమానాశ్రయం నుండి ఛార్లెట్ చేరుకున్నాము. అక్కడ విమానం మారాలి. అక్కడ హ్యాండ్‌బాగ్‌లో ఉన్న పాస్‌పోర్ట్స్, టిక్కెట్లు అన్నీ చూపించి బోర్డింగ్ పాస్ తీసుకొని నార్త్ కెరోలినాకు విమానం ఎక్కాము. నార్త్ కెరోలినాలో మా చిన్నబ్బాయి, మా అల్లుడు (కిషోర్ కుమార్) విమానాశ్రయానికి వచ్చి మమ్మల్ని ఇంటికి తీసుకెళ్ళారు. ఇంటికి చేరిన తరువాత చూసుకుంటే అప్పుడు తెలిసింది మా హ్యాండ్ బాగేజీ మిస్ అయిందని. వెంటనే విమానాశ్రయానికి వెళ్ళి తప్పిపోయిన హ్యాండ్ బాగేజీ గురించి పోలీసు

కంప్లెయింట్ ఇచ్చి వచ్చాము. అప్పుడు స్ఫురించింది, ఇవ్వన్నీ అమ్మ తర్వాత వెళ్ళమంటేకూడా, గురుదేవులు చెప్పింది చెప్పినట్లు వినకుండా మన ఆలోచనలకు బలవంతంగా వారి చేత ఒప్పించి ముందే బయలుదేరినందుకు మాకు కలిగిన బాధలు అని. హ్యాండ్ బ్యాగ్ లో పాస్‌పోర్ట్స్, తిరుగు ప్రయాణానికి అంతర్జాతీయ విమానం టిక్కెట్లు, ట్రావెలర్ చెక్కులు (సుమారు 1800 డాలర్లు) క్యాష్ 200 డాలర్లు ఉన్నాయి. వెంటనే మాతాజీవారికి ఫోనుచేసి హ్యాండ్ బ్యాగ్ పోయినట్లు, అందులోపైన చెప్పిన వస్తువులు పోయినట్లు విన్నవించుకున్నాము. అమ్మ ఎంతో ధైర్యము చెప్పి, బాబూజీ అన్నీ చూసుకుంటారని, ఆయన స్మరణలో ఉండమని ఆదేశించారు.

నేను, మా చిన్నబ్బాయి, ట్రావెల్ ఏజెంట్‌కు, ట్రావెలర్ చెక్స్ ఏజెంట్‌కు ఫోన్ చేసి పోయిన ట్రావెలర్ చెక్స్ వివరాలు అందించాము. శ్రీ మాతాజీ అనుగ్రహము వల్ల, మరియు శ్రీబాబూజీ కృపవల్ల, ట్రావెలర్ ఏజంట్స్ సహాయ సహకారాలతో పాస్‌పోర్ట్స్, ట్రావలర్ చెక్స్ ప్రయాణానికి తిరుగు టిక్కెట్లు సునాయాసముగా కొద్ది రోజులలోనే అన్నీ సమకూరినై. గురుదేవుల కృపను, అనుగ్రహాన్ని తలచుకొని ఏంతో ఆనందించాము.

ఇంతలో మా తోడల్లుడి కూతురు రజనిప్రియ షాపింగ్‌కు వెళ్ళినప్పుడు, ఆమె మంగళసూత్రము మెడలో నుంచి జారి పోయింది. దానితో ఆమె కంగారుగా, భయముతో శ్రీ మాతాజీగారికి ఫోను చేస్తే, మాతాజీ ధైర్యముగా ఉండమని, తాము వచ్చే వరకు పసుపు కొమ్ము కట్టుకోమని చెప్పారు. అక్కడ షాపులలో మంగళసూత్రములు దొరకవు. పదిరోజుల తరువాత సెయింట్ లూయిస్ నుండి శ్రీ మాతాజీగారు శ్రీమతి రేఖగారితో ఫ్లైట్‌లో వచ్చారు. న్యూజర్సీ నుండి రవికాంత్, శ్రీమతి శివప్రియలు కూడా కారులో నార్త్ కెరోలినాకు చేరుకున్నారు.

శ్రీమాతాజీవారు, మా ఇద్దరి కూతుళ్ళతో (శివప్రియ, రజనిప్రియ) మంగళగౌరి పూజ చేయించారు. పూజ అయిన తరువాత మాతాజీగారు తమ మెడలో నుండి లాకెట్టును తీసి, పసుపు తాడుతో కలపి, మంగళ సూత్రముగా చేసి కిషోర్ కుమార్‌తో రజనిప్రియకుమళ్ళీ కట్టించారు. అది చూసి రజని ప్రియ, కిషోర్ కుమార్‌లతో సహా మేమందరము ఎంతో సంతోషించాము. వీరికి మరో ఆశ్చర్యకరమైన అనుభవం ఎదురైంది. వీరు కంప్యూటర్ పుస్తకాలు కొనదలచి షాపింగ్‌కు వెళ్ళారట. కాని బుక్స్ చాలా

ఖరీదుగా ఉన్నందున వాళ్ళుబాధ పడుతుంటే, మా అమ్మాయి శ్రీబాబూజీ అనుగ్రహముతో అవే చౌకగా దొరుకుతాయిలే అని ధైర్యము చెప్తే వాళ్ళు పుస్తకాలు కొనకుండా తిరిగి వచ్చారు. కాని ఎంతో ఆశ్చర్యకరంగా మరుసటి రోజు, అవే పుస్తకములు వారి ఇంటికి కొద్ది దూరములో చెత్తకుండి (Waste box) కి దగ్గరలో ఉంచ బడి కనిపించాయి. అక్కడి ప్రజలు వాళ్ళకు అవసరములేని వస్తువులు Waste boxలకు దగ్గరలో ఉంచుతారట. ఆ పుస్తకములు అవసరమున్న వాళ్ళు తీసుకుంటారని వారి అభిప్రాయము. కిషోర్ కుమార్ వాటిని చూసి ఎంతో సంతోషముతో, శ్రీబాబూజీయే ఆ పుస్తకాలను తనకోసము అక్కడ పెట్టించి ఉంటారని, ఎంతో భక్తి, విశ్వాసములతో వాటిని తీసికొన్నాడు.

న్యూజెర్సీలో ఉన్న రామకృష్ణ (శివప్రియ భర్త) శ్రీమాతాజీగారిచ్చిన దీక్ష పూర్తి చేయగానే అతనికి ఉద్యోగము వచ్చినట్లు శ్రీమాతాజీ గారికి తెలిపి సంతోషించారు.

శ్రీకాంత్ మాతాజీగారితో సహా అందరిని దగ్గరలోని (సుమారు 80 మైళ్ళు) పెద్ద సరస్సునకు బోటింగ్ కోసం కారులో తీసుకొని వెళ్ళాడు. అక్కడ రెండు బోట్లు అద్దెకు తీసుకొని స్వయముగా నడిపిస్తూ సరస్సులో రెండు గంటలు  ఎంజాయ్ చేశాము. నార్త్ కెరోలినాలో అయిదు రోజులు మాతో గడిపిన తరువాత, అమ్మ శ్రీమతి రేఖతో విమానంలో న్యూయార్క్‌కు, శ్రీ సురేష్ శాస్త్రిగారింటికి వెళ్ళారు.

మాతాజీవారు భక్తులను అనుగ్రహించటం కోసం కనెక్టికట్, బోస్టన్, న్యూయార్క్ నగరాలలోని శ్రీమతి వత్సల, శ్రీ కిషోర్ కుమార్ మొదలైన భక్తుల స్వగృహములలో సత్సంగాలు నిర్వహించారు. భక్తులందరు పాల్గొనేవారు. చివర శ్రీ శాస్త్రి  దంపతులు సద్గురు పాదపూజ జరుపుకున్నప్పుడు భక్తులందరు పాల్గొని అమ్మ ఆశీస్సులు అందుకున్నారు.

మాతాజీవారు భారతదేశానికి తిరుగు ప్రయాణమైనప్పుడు మేమందరము విమానాశ్రయానికి వెళ్ళి అమ్మ ఆశీస్సులు పొందాము. అమ్మకు వీడ్కోలు చెప్తున్నప్పుడు,  ఏదో పోగొట్టుకున్న ఫీలింగ్. మాతాజీగారి కళ్ళలో కూడా బిడ్డలను వదలి వెళ్తున్న తల్లి బాధ కనిపించింది. *

# మృత్యుంజయా పాహి

-భోగరాజు భారతీదేవి

తెల్లవారుజామున పూజ చేసుకుంటున్నాను. పూర్తి అవబోతుండగా 'అత్తయ్యగారూ!' అనే పిలుపు వినబడి వెనక్కి తిరిగాను. తలుపునానుకుని నిలబడి ఉంది మా కోడలు శ్రీలక్ష్మి. 'ఏమిటమ్మా' అన్నాను. 'మీరు కలలు నిజమని నమ్ముతారా' అంది. 'ఎందుకా సందేహం వచ్చింది?' అన్నాను. 'నాకు ఇంతకు ముందే నిద్రలో కల వచ్చిందండీ. అందులో గోడమీద ఉన్న శ్రీ బాబూజీ ఫోటోలో నుంచి బాబు తన చేతితో చక్కగా పిలిచి ఇక్కడికిరా, నా దగ్గిరగారా అన్నారండీ. నేనెప్పుడూ బాబుని చూడలేదు మరి' అని సంతోషంగా చెప్పింది. నాకూ ఆ మాట విని ఆనందం కలిగింది. 'మా చిన్నప్పుడు శ్రీబాబు మా ఇంటికి వస్తుండేవారు. అప్పుడు బాబుతో మాకు కలలో కనిపించారు బాబు! మీరు' అని చెప్తే 'ఔనమ్మా నేను మిమ్మల్ని తల్చుకున్నప్పుడు మీకు కలలో కనిపిస్తాను' అని చెప్పారు. అందుకే బాబు కనిపించే కలలన్నీ యథార్థాలే' అన్నాను. అప్పుడు గుండుగొలను గ్రామంలో గీతాయజ్ఞం జరుగుతోంది. వెంటనే కొడుకు కోడలు వెళ్ళి దర్శనం చేసుకొని తీర్థప్రసాదాలు తీసుకొని వచ్చారు. వచ్చాక ?శ్రీలక్ష్మి స్వామిని తల్చుకుంటూ నేను గర్భవతినై ఉన్నపుడు కలలో ఒక పిచ్చివాడు కనిపించి బాగా బెదిరిస్తుంటే చాలా భయపడ్డాను. అప్పుడు సాయిబాబా (తను నమ్మిన దైవం) కనిపించి నేనున్నాను నీకు భయంలేదు' అని ధైర్యం చెప్పి వాడి నించి రక్షించారు' అని చెప్పింది. ఆ సమయంలో శ్రీబాబు రక్షణ చేసిన ఎన్నో సంఘటనలు గుర్తు చేసుకున్నాము ఇద్దరం. సాయంత్రం వేళ ఒక చేతిలో పిల్లవాడిని మరో చేతిలో కూరల సంచీ తీసుకుని వస్తోంది శ్రీలక్ష్మి. వెనకనించి స్కూటర్ మీద ఒక దొంగ మెడమీద పెద్దదెబ్బ కొట్టి గొలుసు లాక్కోడానికి ప్రయత్నిస్తే స్వామి అడ్డుపడి గొలుసు వాడికి దక్కకుండా చేశారు. అలాగే ఇంటి తాళాలు పగలగొట్టి దొంగతనం చెయ్యడానికి వచ్చిన దొంగలు లైట్లన్నీ వేసి చూసి చివరికి ఏమీ తీసుకోకుండానే వెళ్ళిపోయారు. వాళ్ళు ఎందుకలా చేసి ఉండవచ్చు అంటే బహుశా గోడమీద ఉన్న శ్రీబాబు ఫోటోలోనుంచి వాళ్ళని ఉరిమి చూసి ఉండవచ్చును అనిపించింది. శ్రీలక్ష్మి ఇంటిగేటు తీస్తుంటే గేటుమీంచి పెద్దపాము ఒకటి కిందపడి పాకుతూ వెళ్ళిపోయింది. మరి మన ఆత్మబంధువైన ఆదిశేషుని రూపం కాబోలుతాను.

ఇలాగ మా మధ్య సత్సంగ కార్యక్రమం జరుగుతున్నప్పుడు నేను మా కోడలికి అద్భుతమైన స్వప్న వృత్తాంత అనుభవం ఒకటి అక్క సుశీలకి కలిగింది చెప్తా విను అన్నాను.

'అప్పుడు శ్రీదేవీ శరన్నవరాత్రులు శ్రీకాళీ వనాశ్రమంలో జరుగుతున్నాయి. చి॥ శోభ పసిది. దానిని తీసుకుని సుశీలక్క ఆశ్రమానికి వెళ్ళింది. నారాయణరాజుగారింట్లో బస చేసింది. నేను నాన్నగారు కూడా వెళ్ళాము అప్పుడు. ఒకరోజు బందా తాతయ్యగారు (పాలూరి శ్రీరామం మామగారు), చలపతిగారు (లెనిన్ తండ్రి) ఇంకా కొందరు కూర్చుని శ్రీబాబు కబుర్లు చెప్పుకుంటున్నారు. అక్క కూడా అది వింటూ అక్కడే కూచుంది. మాటల మధ్యలో చలపతిగారు 'ఒరే తాతయ్యా! నీకు జాతకాలవీ చూడటం తెలుసుగదా'. ఇప్పుడు నా జీవితంలో గ్రహస్థితి ఎలా ఉంది చెప్పు' అన్నారు. తన నక్షత్రం శతభిషం అని చెప్పారు. అది వింటూ అక్క కాస్త శ్రద్ధగా చెవులు రిక్కించింది. ఎందుకంటే బావగారు నారాయణరావుగారి నక్షత్రం శతభిషం అయినందున. "అబ్బే ! నాలుగు రోజుల్లో శని మహాదశ ప్రారంభమవుతోందిరా నీకు" అని చప్పరించారు తాతయ్యగారు. "అయితే ఏమవుతుందిరా?" అన్నారు చలపతిగారు. "ఏం లేదు, ఆఫీసుల్లో పై అధికార్లతో గొడవలు పేచీలు, ఇంట్లో భార్యాబిడ్డలతో చికాకులు. అంతా అశాంతిమయంగా ఉంటుంది. అదీ **2 1/2** సం॥రాలు" అన్నారు తాతయ్యగారు. అయితే నేను వెంటనే వచ్చి ఆశ్రమంలో శ్రీబాబు సన్నిధిలో కూచుంటాను" అన్నారు చలపతిగారు. "అబ్బే! అలాగ ఏం వీల్లేదు. ఆశని దేవుడు అలాంటి మంచి బుద్ధి కలగనివ్వడు. అనుభవించి తీరాల్సిందే' అని ఘంటాపథంగా చెప్పారు. తాతయ్యగారు అంతటితో ఆ ప్రసంగం ముగిసిందిగాని అక్క మనస్సులో ఆ విషయం నిలిచిపోయింది. అయితే ఎవరికీ చివరికి నాకు నాన్నగారికి కూడా చెప్పలేదు శని విషయం. శ్రీబాబు నించి సెలవు తీసుకుని ఇంటికెళ్ళేప్పుడు హృదయ బాబుకి చెప్పుకుందేగాని ఇంటికెళ్ళాక బావగారికి కూడా చెప్పలేదు.

సరిగా శనిదశ ప్రారంభం అయే రోజున అక్క పొద్దున్నే పూజ చేసుకుని వస్తుంటే బావగారు అప్పుడే లేచి వస్తూ సుశీలా! నాకు ఇంతకు ముందే నిద్రలో కలలో బాబు కనిపించారు" అన్నారు. అక్కకి పరమానందమై ఏమన్నారు? అని అనిగింది. "నన్ను తట్టి లేపేస్తూ లే. లే. శనిమహాదశ ప్రారంభమవుతోంది నీకు. అందుకని సుశీల పూజలో ఉన్న గంగ చెంబు తీసి అందులో తీర్థం

ఇల్లంతా జల్లుకో. మీకే విధమైన కష్టమూరాదు'' అని చెప్పారు'' అన్నారు. సుశీలక్కకి ఆశ్చర్యం వేసింది. ఎందుకంటే ఎన్నో సంవత్సరాల కిందట బావగారు **M.A** పరీక్షలు వ్రాసి కాశీ నుంచి వస్తూ ఆ చెంబు తెస్తే అక్క అది పూజలో పెట్టుకుంది. అప్పట్నించీ అది పూజలోనే ఉంది. ఈ విషయం బావగారికి అసలు తెలియదు. మరి శ్రీబాబు సర్వాంతర్యామి, సర్వజ్ఞులు, శరణాగత రక్షకులు అయినందున ఆ విధంగా చెప్పి చేయించి ఆపద నుండి కాపాడారు. అక్క తన జీవితంలో మరపురాని మధురానుభావం అంటుందమ్మా అని చెప్పాను.

ఆపద్బాంధవులు అనుకోగానే మా అబ్బాయి ప్రసాదుని అతి భయంకరమైన కారు ప్రమాదం నించి అర్ధరాత్రి బస్ డ్రైవరు రూపంలో వచ్చి హాస్పిటల్‌లో చేర్పించి, ఆపైన మృత్యుగండం నించి తప్పించి ఎలాగ ప్రాణాలు పోశారో గుర్తు వచ్చి 'నీ పసుపు కుంకుమలు నిలబెట్టారమ్మా' అన్నాను మా కోడలితో.

ఇంకా అద్భుతం ఏమిటంటే అక్క సుశీలని ఆనాడు, నేడు వాళ్ళమ్మాయి శోభని మృత్యుముఖం నించి ఎలాగ తప్పించారో తల్చుకుంటే మనస్సంతా శ్రీగురుదేవుని ఎడల కృతజ్ఞతతో నిండి పొంగిపొర్లిపోయింది. 'అయితే అక్క సుశీల సంగతి నీకు బాగా తెలియదేమో' అనగానే చెప్పండి అంది శ్రీలక్ష్మి. "చూడమ్మా, రెండు సంఘటనలు ఒకే విధంగా జరిగాయి. రక్షణ కూడా ఒకటే.

ఆనాడు 1980వ సం॥లో ఫిబ్రవరి 16వ తేదీ సంపూర్ణ సూర్యగ్రహణం. అక్క సుశీలకి ప్రసవ వేదన ప్రారంభమైంది. 3వ నెలనుండీ ఆశ్రమంలో తనని ఉంచి, క్షణక్షణం గమనిస్తూ శ్రేయోభిలాషినని ఉత్తరం వ్రాయించిన శ్రీగురుదేవులు తన మాట నిలబెట్టుకున్నారు. తను చేసిన దీక్షల ఫలితమూ, తన రక్షణ బలమూ అక్కకి అందించారు. 16వ తేదీ ప్రసవ వేదన ఆరంభమై ప్రసవం కాక ఇక అదనపు వైద్య సహాయం అవసరమనిపించి 17వ తేదీ గుంటూరు గవర్నమెంట్ హాస్పిటల్‌కి అక్కని తరలించారు. కేసు చూస్తున్న డాక్టరమ్మతో కారులో పంపిస్తూ అక్కని "తల్లీ బిడ్డని క్షేమంగా పంపించే బాధ్యత మీది'' అని హెచ్చరించారు. రాత్రి 8గం॥లకి సిజేరియన్ చేశారు. తల్లీ బిడ్డల పరిస్థితి విషమించింది. డాక్టర్లు ఆశవదులుకున్నారు. ఇద్దరూ లేరన్నారు. ఆశ్రమంలో శ్రీబాబు రాత్రి తెల్లవార్లూ మెలకువగా ఉండి ఫోన్‌లు

వింటూ " అలా జరగటానికి వీల్లేదు. నన్ను నమ్ముకున్న జీవులు వాళ్ళు. నేను 'చక్రం అడ్డం వేశాను' అన్నారు. ప్రాణ రక్షణ జరిగింది. శ్రీబాబు చేతిలో నుండి పునర్జీవితులై అక్క సుశీల పాప శోభ ఆశ్రమానికి తిరిగి వచ్చారు. ఆనాడు ఆశ్రమమంతా ఈ సంఘటనతో బొబ్బటిల్లి పోయింది. మరి తిరిగి...

2009వ సం॥ జూలై నెల 22వ తేదీ సూర్య గ్రహణం. 23వ తేదీ చి॥సౌ శోభకి ప్రసవ వేదన ప్రారంభమైంది. అతి సులువుగా ప్రసవం జరిగి పోతుందనుకున్న వేళ కథ అడ్డం తిరిగింది. శక్తికి మించిన కృషి చేశారు డాక్టర్లు. అయినా క్షణాలమీద అదనపు వైద్య సహాయం అవసరమైన పరిస్థితి ఏర్పడింది. వైద్యులు చేతులు జోడించి శ్రీగురుదేవులను ప్రార్థించారు. మీరే దిక్కని. ఆస్పత్రిలో భగవన్నామం మారు మ్రోగింది. శోభని విజయవాడ మణిపాల్ హాస్పిటల్‌కి తరలించారు. ఆత్మీయులైన ఆశ్రమవాసులంతా రక్తం ఇచ్చి ఆదుకునేందుకు సిద్ధంగా నిలిచారు.

పూజ్య శ్రీ మాతాజీ రూపంలో శ్రీబాబు క్షణక్షణం ఫోన్‌లు చేస్తూనే ఉన్నారు. శ్రీజగన్మాతృ స్వరూపులైన శ్రీగురుస్వరూపానికి గజ ప్రాణావనోత్సాహియైన స్వామికి పిలుపు అందింది. 'ఆశ్రమంలో ఉండే చిన్న చీమకి కూడా హాని జరగదు' అనేది శ్రీబాబు ఇచ్చిన అభయం. సద్గురు నాధుని అభయ హస్త ముద్రనించి రక్షణ పొందిన చి॥సౌ॥ శోభ చిరంజీవి బాబు మృత్యుంజయులైనారు.

శ్రీ రామకృష్ణ పరమహంస వారు ఒకనాడు తమ ఉద్యానవనంలో చెట్టుమీద పువ్వుని చూపిస్తూ "ఇది నీలపు రంగులో ఉంది. రేపు ఇదే చెట్టు ఎరుపు రంగులో పూస్తుంది పువ్వుని'' అన్నారు తమ శిష్యునితో. మరురోజు అలాగే జరిగింది. దైవం సర్వశక్తిమంతుడు. తన సృష్టిని తానే మార్చగలడు. అసంభవాలు సంభవాలు చేయగలడు'' అన్నారట అలాగే విధిని శాసించి తనదైన మహిమను ప్రకటించగల సర్వసమర్థుడు, సకలదేవతా స్వరూపుడు అయిన శ్రీగురుదేవుడు. నాడు, నేడు జరిగిన సంఘటనలు ఒకేలా ఉండి తనదైన ఒకే రక్షణ అందించిన అనంతలీలా వైభవం స్వామిది. మన జీవిత పరమావధి శ్రీగురుపాదం ఒక్కటే అన్నారు గురుమూర్తి పూజ్య శ్రీ మాతాజీ. ఆ పాదాన్ని ఆశ్రయించిన వారికి ఇక లోటేముంది?

ఇలాగ, ఇద్దరం చెప్పుకుంటూ ఆ అమృతతత్వం తనివితీర ఆస్వాదిస్తుంటే కాలం ఎలా గడిచిందో తెలియలేదు. తనువు తెలిసే సరికి కళ్ళనిండా నీళ్ళ ప్రవాహాలు. ఎదురుగా శ్రీబాబు ఫోటోలోనుంచి కన్నుల్లో కరుణ, చిరునవ్వులో చల్లని వెన్నెలలు అమృతపు జల్లులై కురుస్తున్నాయి. *

# ఎందుకు భయం? ఇచ్చాను అభయం

మన జీవితాలలోనే సంభవమయ్యే కొన్ని మధుర ఘట్టాలను ఎంత కాలమైనా మరచిపోలేం. అలాంటి ఘట్టాలు ఏ కొద్దిగానో, అరుదుగానో, అపురూపంగా ఉంటాయి. కావటానికి అరుదైనవే అయినా, అవి మిగిల్చే స్మృతుల తాలూకు ఆనందం మాత్రం అనిర్వచనీయమైనది.

నా పదమూడో ఏట - అంటే దాదాపు 1946వ సం॥లో శ్రీబాబును చూచిన సంఘటన అటువంటిదే. అప్పుడు బాబు గుండుగొలనులో ఒక భక్తుల ఇంట్లో బస చేసి ఉన్నారు. మా ఊరంతా వారి మహిమల తాలూకు కథలతో మారు మోగి పోతోంది. ఆయన ఎలా ఉంటారో చూడాలనీ, వీలైతే ఆయనతో మాట్లాడాలనీ, నా ఆకాంక్ష. కాని అంత మహానుభావులకు, తపస్వులకు, దగ్గిరగా వెళ్ళాలంటే ఏదో బెరుకు, సంకోచం. చెప్పలేని భయం. చివరకు వారిని చూడాలన్న కుతూహలమే, వారి మహత్వం తాలూకు భయాన్ని బాపింది.

శ్రీ బాబు బస చేస్తున్న ఇంటివారు నాకు తెలిసినవారే. వారి ఇంటి కిటికీలోంచి శ్రీబాబు లీలగా కనపడుతున్నారు. ఆయన నన్ను చూచినట్లే లేరు. నన్ను ఆయన చూడకుండా, ఆయనను నేను చూచే అవకాశం కల్గినందుకు కొంత తృప్తిగానే ఉంది. అరుగుమీద కూర్చుని, క్రిందకు వేలాడేసిన కాళ్ళను ఊపుతున్నారు.

"అమ్మా! జాగ్రత్తగా కూర్చో. ప్రసాదం తీసుకుందువుగానీ అని మాటలు వినిపించాయి.

బాబు నా వైపు చూడలేదు. కాని అవి ఆయన మాటలే. ఆ మాటలు నా చెవిని బడ్డ క్షణంలో నాలో ఏదో చెప్పలేని ఆనందం కలిగింది. దానికి కారణం ఏమిటో ఎవరూ చెప్పలేరు. అదే వారి నిర్హేతుక జాయమాన కరుణా కటాక్షం. ఆ క్షణంలో నాలోని భయమూ, బెరుకూ పోయాయి. అంతే కాదు - జీవితమంటేనే భయం పోయింది. తరువాత నా జీవితంలో ఎన్నో కష్టపు ఘడియలు గడిచాయి. కాని ఎంత కష్టంలో ఉన్నా ఏనాడూ భయం కలుగలేదు. కాస్త కష్టం కలిగితే బాబు గొంతు విన్పించి, భయం మటుమాయమై, దానికి భిన్నమైన స్థిరత్వమూ, ఆనందమూ నన్ను ముంచెత్తేవి.

ఇంతకీ 'ఇదంతా దేనికి చెబుతున్నానా' అనే అనుమానం మీకు కలగటం సహజమే. ఈ మధ్య జరిగిన ఒక విచిత్ర సన్నివేశాన్ని మీ దృష్టికి తేవటానికే ఈ ఉపోద్ఘాత మంతా.

మొన్న ఈ మధ్య - 10.4.2009, ఆదివారం రోజున సాయంత్రం

5గం॥లకు శ్రీకాళీగార్డెన్స్ ఆశ్రమం గోడను ఆనుకొని ఉన్న మారేడు చిగుళ్ళు కోసుకుందామని వెళ్ళాను. నాకు రోజూ మారేడు దళాలతో శివాలయంలోని శ్రీరామలింగేశ్వర స్వామిని అర్చించటం బహుకాలంగా ఏర్పడిన అలవాటు. ఆరోజూ అలాగే దళాలకోసం వెళ్ళి అందిన చిగుళ్ళు కోస్తూ, కోస్తూ, చటుక్కున ఎడమవైపుకు పడి పోయాను. పడటం పడటం ఎడమ పాదం నుంచి. ఎడమ నెమరుకణత వరకూ చాపచుట్టగా నేలవాలి పోయాను. ఆ పడటంలో నా కళ్ళజోడు ఎక్కడో ఎగిరి పడిపోయింది. నా వయస్సిప్పుడు 74సం॥. కళ్ళజోడు లేక అంతా బూజర బూజరగా ఉన్నది. ఏదీ స్పష్టంగా కన్పించటం లేదు.

పడుతూనే "ఫళ్ళ్" మని పెద్ద శబ్దమైంది. ఏదో విరిగింది. చెయ్యో, కాలో కూడ తెలియలేదు. ఒక విభ్రాంతమైన స్థితిలో పడ్డాను. తొందరలోనే ఎడమచేతిలో కొంత నెప్పనిపించి, ఎడమ చెయ్యి విరిగింది కాబోలు ననుకున్నాను. వెంటనే బాబు నామస్మరణ చెయ్యటం మొదలు పెట్టాను. తీవ్రమైన నొప్పి ఏ మాత్రం నేను అనుభవించలేదు.

నా చుట్టూ ఏం జరుగుతోందో నాకే తెలియదు. స్పృహ ఉందంటే ఉంది, లేదంటే లేదు. కాని నాలో నామస్మరణ మాత్రం ఆగకుండా జరిగిపోతున్నట్లు నాకు తెలుస్తున్నది. ఎవరో నన్ను కారులో ఎక్కించి ఆసుపత్రికి తీసుకెళ్ళారు. సీత, ఆమె భర్త, పాండురంగనాథ్ నన్ను కారులో తీసుకెళ్ళారు. మా అబ్బాయి అడ్రసు కావాలి. నన్ను అడిగారేమో? తెలియదు. కాని వాళ్ళే ఎలాగో మా అబ్బాయికి ఫోన్ చేశారు. ఆశ్రమంలో భక్తులు చాలా మంది వచ్చారు. పడ్డానన్న భయం తప్ప బాధ లేదు. హాస్పటల్‌లో నన్ను హైదరాబాదు తీసుకెళ్ళాలని చెప్పారు. ఈ విరిగిన చేత్తో కారులో 6గం॥లు ప్రయాణం చేస్తేగాని హైదరాబాదు రాదు. అంత సేపు బాధ భరించ గలనా? ఓం బాబు ఓం బాబు అనుకున్నాను.

కాని విచిత్రం ఏమిటంటే, నాకు క్రింద పడ్డానన్న భయం తప్ప, బాధ ఏ మాత్రమూ లేదు. కారు ఎగుడుదిగుళ్ళలో ప్రయాణం చేసిందో, గతుకుల్లో పరుగులు తీసిందో ఏమీ తెలియదు. నేను కన్ను మూసి తెరిచేటప్పటికి 6గం॥లూ గడిచి పోయాయి. ఏదో అయిపోయిందన్న భయమూ, దాని తాలూకు ఆందోళనా తప్ప, బాధగానీ, నొప్పిగానీ, ఏమాత్రమూ అనుభవంలోకి రాలేదు. లోపల నామం మాత్రం జరిగిపోతూనే ఉన్నది.

హైదరాబాదులో మర్నాడు పొద్దున నన్ను కామినేని హస్పిటల్సుకు తీసుకు వెళ్ళారు. అక్కడ నన్ను చూచిన డా॥ రమణా రెడ్డిగారు "మీరు ఇంతకు ముందునుంచీ Ecosprin వాడుతున్నారు గనుక, మీకు 24గం॥ తర్వాతే ఆపరేషన్

చేస్తామన్నారు. ఆరోజంతా కదలకుండా మంచం మీద పడుకున్నాను. లోపల నామస్మరణ అఖండంగా జరిగిపోతున్నది. ఓం బాబు ఓం బాబు... ఇప్పుడు ఆందోళన తప్ప నొప్పి అసలు లేదు. ఆ మరునాడు భుజానికి రంధ్రం చేసి ఆపరేషన్ చేశారు. ఆపర్‌షన్ చేసినప్పుడు ఏ మాత్రం బాధ కలుగ లేదు.

ఆపరేషన్ అయ్యాక, నా పరిస్థితిని చూచి నాకే భయం వేసింది. "నాకు చెయ్యిరాకపోతే దిక్కేమిటి? శేష జీవితం ఎలా గడుస్తుంది? జీవితమంతా ఇతరుల మీద ఆధార పడటం కంటె తనువు చాలించటం మేలుగదా....." భయంతో కూడిన ఆలోచనలు.... అయినా వీటన్నింటి వెనుక నామం జరుగుతూనే ఉన్నది. ఇంతలో మంచం ప్రక్క ఎవరో సాధువు నిలబడ్డట్లనిపించింది. "ఎవరా?" అని చూచానుగానీ పోల్చుకోలేక పోయాను. ఇంతలో సాధువు మాయం అయాడు. మెలకువ వచ్చింది, భయం వేసింది. "బాబూ ఏమిటీ భయం? అనుకున్నాను. Why fear ?I am here - ఎందుకు భయం ఇచ్చాను అభయం - బాబూజీ అంటున్నట్లు అనిపించింది. ఇంతలో మగత. మళ్ళీ కల. ఈ కలలో మాతాజీ వారు ఏదో యజ్ఞానికి ప్రయత్నం చేస్తున్నారు. భయం మాటెలా ఉన్నా, బాధ మాత్రం కించిత్తూ లేదు.

అలా 9 రోజులయాక ఒక రోజున కుట్లు విప్పుదామని వచ్చి, కుట్లు విప్పే పరికరం మరచి వచ్చారు డాక్టరుగారు. మెల్లిగా చేత్తోనే కొన్ని కుట్లు తీసేసి, "మీ ప్లాన్ ఏమిటి?" అన్నారు డా॥ రెడ్డిగారు.

"మీ దయ ఉంటే ఉంటాను" అన్నాను. ఆశ్రమ వాతావరణమూ, ప్రశాంతతా, దేవాలయాలూ, నేను చేసే సేవా - వీటిని గురించి వివరించి చెప్పాను.

నా మాటలు విని ఆయన మెత్త బడ్డారు. "రేపు వచ్చి చూస్తాను. అప్పుడు చెబుతాను" అన్నారు.

డాక్టరుగారు మరునాడు వచ్చి, నన్ను చూచి "ఇంకా బాగా అతక లేదు. కానీ మీ మాటలు వింటుంటే మీకు ఆశ్రమ వాతావరణం సంపూర్ణంగా విశ్రాంతి నిచ్చేట్లుంది. జాగ్రత్తగా గడుపుతూ, నెల తరువాత రండి? అన్నారు.

"జాగ్రత్త! బ్రతుకు అయిపోతోంది. ఇంకా కాలం వ్యర్థం చెయ్యటం తప్పు కదా?" అనే బాబుగారి మాటలు నా చెవిలో మార్మోగాయి. ఇప్పుడు భయం కూడ పోయింది. బాధ అంతకు ముందే లేదు. నా కొడుకూ కోడలూ చేసిన సేవతో చెయ్యి త్వరలోనే స్వాధీనానికి వచ్చింది. ఇప్పుడు భయమూ బాధా రెండూ లేవుగాని, "జాగ్రత్త!" అన్న బాబు మాటలు నా చెవులలో అనుక్షణమూ ప్రతిధ్వనిస్తూనే ఉంటాయి. *

# సంత్ నామదేవ్ చరితామృతం

-మనోజ్ కుమార్

ఇంటికి చేరగానే కాళ్ళకు నీళ్ళు ఇచ్చి నామదేవుణ్ణి అరుగుమీద చాప వేసి కూర్చోబెట్టి ఆ గృహస్థుడు లోపలికి తొంగిచూస్తూ "ఇదిగో వింటున్నారా! ఇవాళ అతిథి భోజనానికి వచ్చారు. కాస్త బయటికి వస్తే వారిని దర్శించి నమస్కరించి పుణ్యం కట్టుకుని ఆయనకు నైవేద్యం సమర్పిద్దాం'' అన్నాడు. లోపలనుంచి గిన్నెలను ఎత్తిపడేసినట్లు, గరిటలు విసరి నేలకేసి కొట్టినట్లు ధ్వనులు వినిపించాయి. ఆ వెనువెంటనే దేనినో కాలితో గట్టిగా తన్నిన చప్పుడు, అది దొర్లుకుంటూ పోతూ చేసిన చప్పుడూ వినిపించాయి. ఆ ధ్వనుల మధ్య "నేనెందుకు రావాలి బయటకు? నేను ఎవరో దారిన పోయే దానయ్య ముఖం చూడాలా? ఇవాళ ఏ దరిద్రుణ్ణి తెచ్చావు? తిండికి గతిలేనివాణ్ణి తెచ్చి కూర్చోబెట్టి పైగా ఆ దరిద్రపుగొట్టు ముఖం చూడమంటావా? ఎట్లని యాగాణి సంపాదించటం చేతకాదుగాని ఖర్చుపెట్టే తెలివితేటలు మాత్రం బాగా ఉన్నాయి'' లోపలినుండి అమ్మగారి కంఠం ఖంగుమని మ్రోగింది.

**నామ -** (నవ్వుతూ) అమ్మగారికి ఇష్టం లేకపోతే నేను ఇక్కడ ఆగనమ్మా! వెళ్ళిపోతాను.

**గృహ -** మహరాజ్! ఆగండి నేను గృహస్థును. అతిథి ఉపవాసంతో వెళ్ళిపోతే నాకు పుట్టగతులు ఉంటాయా? నరకమే గతి.

నామదేవుడు మనస్సులో నరకంకాకపోతే ఇప్పుడు నువ్వు స్వర్గ సుఖాలు అనుభవిస్తున్నావా అనుకున్నాడు. గృహస్థుడు లోపలికి వెళ్ళాడు. "కావలిస్తే పోనీ ఈ పూటకు నేను అన్నం తింటం మానేస్తాను. నా వంతుది అతిథికి పెట్టు'', అతడు భార్యను ప్రాధేయ పడుతున్నాడు. లోపల జరుగుతున్నదంతా బయటకు బాగా వినిపిస్తున్నది. "ఎవడా అతిథి? నీవే ఒక ఆంబోతువు. ఊరుమీద పడ్డ ఇంకొక ఆంబోతును తెచ్చావా తేరగా మేపటానికి అంటూ విరుచుకు పడింది గృహిణి. ఆ మాటతో గృహస్థుడు రెచ్చిపోయాడు. కోపంతో ఊగిపోతూ ఆమె జెడపట్టుకుని గట్టిగా లాగాడు. దానితో ఆమె మెడ ఇరుకుపట్టి క్రింద పడ్డంత పని అయింది. ఆమె కూడా ఏమీ తక్కువ తినలేదు. ఎడమచేతితో అతని జుట్టు పట్టుకుని కుడిచేతితో అతని చెయ్యి మెలేసి, కాలితో తన్ని అతణ్ణి క్రింద పడేసింది. అలా క్రింద పడ్డ అతని

చెంపలు ఫెడా ఫెడా వాయించింది. అతడు క్రింద పడ్డ తాకిడికి పెద్ద చప్పుడై ఆ ఇల్లంతా అదిరింది. అతడు బూతుల పంచాగం విప్పి తనకు వచ్చిన తిట్లన్నీ తిట్టాడు. అతడి ఒక్కొక్క తిట్టుకూ ఒక్కొక్క తన్ను తన్నింది ఆ గృహిణి. చివరకు అతణ్ణి ఇష్టం వచ్చినట్లు తన్ని, దొరికిన చోటల్లా రక్కి , రక్తం వచ్చేలా కొరికింది. అరుగుమీద కూర్చుని ఇదంతా వింటున్న నామదేవుడికి ఏం చేయాలో పాలుపోవటం లేదు. ఈ కొట్లాట ఎట్లా ఆపాలి. అతనికి ఏ ఉపాయమూ తోచటంలేదు.

ఇంతలో ఈ చప్పుళ్ళు విని ప్రక్కింటాయన లోపలికి వెళ్ళటం కనిపించింది. "ఏమిటమ్మా ఇది?" అది ప్రక్కింటాయన గొంతు. వాక్యం పూర్తికాకముందే చెంపలమీద ఛడేల్ ఛడేల్ మని నాలుగు వాయించిన చప్పుడు వినిపించింది. ఆ వెనువెంటనే పిడికిలితో మూతిమీద గట్టిగా గుద్దిన చప్పుడూ, ప్రక్కింటాయన బాధ భరించలేక పెద్దగా మూలగటం వినిపించాయి. అతని పెదవులు చిట్లి నెత్తురు కారింది. ముందు పళ్ళు ఊడాయి. మరికొన్ని పళ్ళు కదిలాయి. అంతలో ఈ గోల విన్న ఎవరో ఇద్దరు ఈ తగవును విడిపిద్దామని లోపలికి వెళ్ళారు. కాని వాళ్ళు వెంటనే బయటకు పరిగెత్తుకుంటూ వచ్చారు. బాగా దెబ్బలు తగిలి వీపులు కమిలిపోయి ముఖాలు వాచి ఉన్నాయి. పరుగెత్తుతున్న వాళ్ళను పట్టుకోవటానికి వెనకనుంచి తరుముకుంటూ బయటకు వచ్చిన ఆ గృహిణికి అరుగుమీద కూర్చున్న నామదేవ్ కనిపించాడు.

ఆమె నామదేవుణ్ణి చూస్తూ ఒరేయ్! నీవేనట్రా అతిథివి? నీ మూలంగానే కదా ఇంత గొడవ. ఉండు ముందు నీకు శాస్తి జరగాలి. తేరగా చేసి వడ్డిస్తే, గుటకలు వేస్తూ గుటకాయస్వాహా చేద్దామని వచ్చావా? ఇదిగో వడ్డిస్తున్నా చూడు అంటూ నామదేవుడి వీపు మీద రెండు ఘనంగా వడ్డించింది. బైర్లుకమ్మిన నామదేవుడి కళ్ళముందు పాండురంగడు కనిపించాడు. వెన్నులో ఏదో బాధ. ఏమైందో తెలియదు. ఆగి చూసుకొనే అవకాశం లేదు. వెంటనే లేచి దులుపుకొని వెనక్కు తిరిగి చూడనైనా చూడకుండా పరుగు లంకించుకున్నాడు. ఈసారి ఆమెకు అందితే ఇంకేమైనా ఉందా!కానీ అన్నీ అనుకున్నట్లు జరుగుతాయా! జరిగితే ఇంక పాండురంగడితో పనేముంటుంది! అంతలోనే పంచ అడ్డం వచ్చి గడపకు తట్టుకుని క్రిందపడిపోయాడు. మోకాలు చిట్లి రక్తం వస్తున్నది.'అదృష్టం బాగుండి ఎముకలు ఏవీ విరిగినట్లులేదు అనుకుంటూ వెనక్కు తిరిగి చూసిన నామదేవుడికి ఆ ఇల్లాలు తనవైపే

వస్తుండటం కనిపించింది. అంతబాధలోనూ ఎక్కడినుంచి వచ్చిందో ఆ సత్తువ ఒక్క అంగలో విష్ణు ఆలయంలో వచ్చి పడ్డాడు.

అప్పటికే భిక్షాటన ముగించివచ్చి ముద్దనోట్లో పెట్టుకోబోతున్న వాసుదేవ్ పరిగెత్తుకుంటూ వచ్చిన నామదేవుణ్ణి చూసి "రా నామా! సమయానికి వచ్చావు. ఇవిగో వీటిని తిను'' అంటూ రొట్టెలు ఇచ్చాడు. సాయంత్రం నామదేవుడి మోకాళ్ళకు కట్టు కడుతూ "మా గురుదేవులు నన్ను గృహస్థుల ఇళ్ళలోకి వెళ్ళవద్దని ఎందుకు నిషేధించారో ఇప్పుడు అర్థం అయిందా? ఇది కలియుగం. వాకిలి బయట నిలబడి భిక్ష అడగాలి. లేదంటే మరో గడప, కాదంటే ఇంకో గడప, అంతేకాని లోపలికి వెళ్ళితే దెబ్బలే. అదీ ఆడవాళ్ళచేత. అర్థం అయిందా?'' అన్నాడు. నామ అయిందన్నట్లు బాధతో గట్టిగా మూల్గాడు.

ప్రయాణం చేస్తున్న కొద్దీ కలిఘోరాలన్నీ ఒక్కొక్కటే నామదేవుడికి కళ్ళకు కట్టినట్లు కనిపించాయి. అయినా ఇన్ని ఘోరాలలో కూడ సజ్జనులు భగవన్నామ మహిమను జనులకు తెలియ పరుస్తున్నారు. తుల్జాపూర్‌లో భవాని సమక్షానికి వచ్చాక వాసుదేవ్ నామదేవుడికి బార్షీకి దారిచూపి, తాను అక్కడే ఆగిపోయాడు. నామదేవ్ బార్షీ చేరుకున్నాడు. అక్కడ గుళ్ళో కొంతసేపు సంకీర్తన చేసి, తరువాత పైఠణ్ చేరుకున్నాడు. గోదావరిలో స్నానం చేస్తూ, గోదావరి తల్లికి, ఆమె చిన్న చెల్లెలు చంద్రభాగ సందేశం వినిపించాడు. తరువాత ఘృష్ణేశ్వర్ చేరుకున్నాడు. ఘృష్ణేశ్వర్‌లో మూడవనాటి రాత్రి శివుడు స్వప్నంలో కనిపించి 'ఇక్కడనుండి నీవు అంబేజోగాయి వెళ్ళు. అక్కడ కుమారిగా ఉన్న యోగీశ్వరి నీకు వెళ్ళవలసిన దారి తెలుపుతుంది' అని చెప్పాడు. నామదేవుడు ఏ గుళ్ళోనో, చెట్టుక్రిందనో విశ్రాంతి తీసుకుంటూ నడక సాగించాడు. జయంతి నదిలో స్నానం చేసి ఉదయిస్తున్న సూర్యుడికి నమస్కరించి ప్రయాణం మొదలు పెట్టాడు. ఎదురుగా గోపురం. అందులో ఒక చిన్న మందిరం. ఆ మందిరం గుమ్మం వద్ద ఒక గోసావి కూర్చుని ఉన్నాడు.

**గోసా -** అరే లంగోటే బచ్చా! ఎక్కడనుండి వస్తున్నావు?

**నామ -** పంఢరిపురం నుండి.

- సశేషం

# గురుకృప

(గతసంచిక తరువాయి) -శివ ప్రసాద్

**మి.స -** మహాభాగా! బ్రాహ్మణులను రాజులు పూజిస్తారు. అలాగే నేను కూడా విప్రార్చనము చేస్తుంటాను. కాని వారిని సేవించటం అంత సులభమైనది కాదు. ఏమాత్రం పొరపాటు జరిగినా కష్టమే. విప్రశాపం వల్లనే నాకీ దుర్గతి సంప్రాప్తం అయినది. పోనీ ఇందులోనుంచి బయటపడటానికి వేరే మార్గం ఏదైనా ఉన్నదా అంటే నాకు మేలు కలగాలంటే విప్రులను అర్చించి వారిని సంతోషపెట్టటం కన్నా వేరే మార్గం ఏదీ కనిపించటం లేదు. ఆ కారణంగానే నేను 'మనకు భూసురులను పూజించటం ఒక్కటే మార్గం, అయితే దీనివలన తప్పక మేలు కలుగుతుంది అని గట్టిగా నిశ్చయంగా చెప్పలేము. భూసురులను పూజించటం కష్టం అన్నమాట కూడా నిజమే. కాని దుర్గతి తొలిగి మేలు కలగాలి అంటే దానికన్నా వేరొక మార్గం లేదు. ఈ విప్రుడికి కుండలములు ఇచ్చి అతనిని సంప్రీతుణ్ణి చేస్తే నీవలన నాకీ దుర్గతి బహుశ తొలగిపోవచ్చు. పోయినా పోకపోయినా వేరే మార్గం లేదు.అని గూఢంగా ఆమెకు నీతో ఆనవాలు పంపించాను. ఆ మహాపతివ్రతా శిరోమణి దానిని అర్థం చేసుకుని అత్యంత విశేష మహిమాన్వితమైన ఆ కుండలాలను నీకు ఇచ్చి నిన్ను సంప్రీతుణ్ణి చేసింది.

ఆ భృగువంశ వరేణ్యుని పుణ్య సన్నిధి, సత్సాంగత్య ప్రభావం వలన ఆ సౌదాస మహారాజులో ఎంతో మార్పు వచ్చింది. ఆ సత్సాంగత్య ఫలంగానే అతని చిత్తములో ఇప్పుడు నరమాంసం తినాలనే కోర్కెపోయి అది సమాధాన పడింది. అతడిలోని రక్షోగుణం స్థానంలో నూతన సత్త్వం వచ్చి చేరింది. ఆ విశిష్ట మణిమయ మహాకుండలములు బ్రాహ్మణునికి దానంగా ఇచ్చిన పుణ్యఫలంగా ఆ భయంకర రాక్షసుడి నోటినుండి శాంత వచనములు వెలువడుతున్నాయి. ఉదంకుడు ఆ రాక్షసుడు చెప్పిందంతా శాంతంగా ఆలకించిన తరువాత........

**ఉదం -**రాజా! నాలుగుమాటలు కలిస్తే వారు వీరు మిత్రులు అవుతారు అని పెద్దలు చెప్తారు. నేను నీ పలుకులకు ఎంతో ఆనందించాను. నీవలన కృతార్థుడనైనాను. గురుకార్యాన్ని నిర్వర్తించటంలో నీవు నాకొనరించిన సహాయం అసమానమైనది. ఇక నేను త్వరగా వెళ్ళి ఈ కుండలములు మా గురుపత్నికి సమర్పించి, మా గురుదేవుడికి నమస్కరించుకొని వెంటనే తిరిగి

వస్తాను. నేను మాట తప్పేవాడిని కాను. నా నాలుక అన్నృతం పలకదు. దయచేసి ఇక నాకు అనుజ్ఞ ఇవ్వు.

ఉదంకుడి మాటలు వింటున్నకొద్దీ ఆ రాక్షసుడి చిత్తం శుద్ధం అవుతూ అందులో ఉన్న రాక్షసత్వం, క్రూరత్వం స్థానంలో కరుణ, కృపారసం వెల్లువలా పొంగివస్తున్నది. అతడు ఆ భూసురోత్తముని కృపాదృష్టితో చూస్తూ.......

**మి.స -**ఓ సంయమీంద్రా! నీ మహామహిమమును ఏమని కొనియాడ గలను? చంపెడి వాడి బారిపడి తప్పించుకున్నవాడెవడైనా మళ్ళీ ఆ చంపెడివాడి వద్దకు తిరిగి వస్తారా! నీకు ప్రాణములు తృణప్రాయము. దేహాభిమానము సుంతైనా లేని మహితాత్ముడవు. అన్నిటినీ మించి పరమ గురుభక్తాగ్రగణ్యుడవు. నీ సందర్శనభాగ్య మాత్రముననే నాలో ఆనందం పొంగిపొరలుతున్నది. నా రాక్షసత్వము అణగిపోయింది. ఓ సంశ్రితార్తి హరణా! నాకు కలిగిన ఈ దుర్గతిని బాపి నన్నీ స్థితినుండి రక్షింపగల సమర్థుడవు నీవే. దయచేసి నీ అనంత తపస్సంపదలో కొంచెం ధారపోసి నా ఈ దుర్గతిని తొలగించి నాకు నా పూర్వ రూపాన్ని ప్రసాదించు.

సౌదాసనరేంద్రుని మాటలు వింటున్నకొద్దీ ఉదంకుని మనస్సు కరిగిపోయింది. అతడి చిత్తం ఆ అభాగ్యుని ఎడల అత్యంత ప్రసన్నం అయింది.

**ఉదం -** రాజా! నీ చిత్తం ప్రసన్నమౌతూనే నీలోని రాక్షసత్వం హరించి పోయింది. నీ సుగుణసంపత్తి, నీ దానశీలతచే నీవు వీతకళంకుడవైనావు. దిగంత యశోవిశాలుడు, నిర్హేతుక జాయమాన కరుణాసముద్రుడు అయిన అస్మద్గురుదేవుల చల్లని దృగంచలామృత నా కధునీశీకరములు నీపై వర్షించి నట్లున్నవి. అందువలననే వారు ఈ కుండలముల మిషతో నన్ను నీ వద్దకు పంపినట్లనిపిస్తున్నది. గురుదేవుల, మహాత్ముల లీలలను, వచనములను, కృత్యములను అర్థం చేసుకోవటం ఎవరి తరం. రాజా! తక్షణమే నీవు ఉత్తమ గతిని పొంది నీ పూర్వ వైభవమును పొందెదవుగాక!

అలా ఉదంకుడు ఆ రాజును సమాశ్వాసిస్తూ అతనిని అనేక విధములుగా దీవించి తన పవిత్రహస్తములతో ఆ సౌదాస నరేంద్రుని మేనును అంతటా ప్రేమాదరాలతో నిమిరాడు. దానితో నిర్ధురితుడై, శాపవిముక్తినొందిన సౌదాస నరేంద్రుడు తన పూర్వశరీరమును పొంది కృతజ్ఞతా భావంతో ఒడలు కంపిస్తూ ఉంటే భక్తి, వినయ సంభ్రముడై ఆ పరమ మునిని అనేక విధాలా ప్రస్తుతించి...........

**మి.స -** ఓ మునీంద్రా! మీరొనర్చిన ఉపకృతికి ప్రత్యుపకృతి చేయాలంటే ఏదీ కనబడటం లేదు. దయచేసి నా ఆతిథ్యమును స్వీకరించి వెళ్ళండి.

ఉదంకుడు అంగీకరించి రాజగృహానికి భోజనానికి వెళ్ళాడు.

ఈ మిత్రసహుడు ఎవరు? ఇతడు బ్రాహ్మణ శాపం వలన ఎందుకు రాక్షసత్వం పొందాడు? అతని చరిత్ర తెలుపవలసింది అని ప్రార్థించిన జనమేజయునకు వైశంపాయనుడు చెబుతున్నాడు.

రాజా! పూషుని వంశజుడైన సూర్యవంశపు రాజు పౌష్యుడు. పౌష్యుని భార్య మదయంతి. ఇతడొకనాడు వేటకు వెళ్ళి రెండు పులులను చూచి వానిలో ఒకదానిని బాణముతో కొట్టాడు. రెండవది దనుజరూపం ధరించి పారిపోయింది. ఇది జరిగిన కొంతకాలానికి మిత్రసహుడు ఒక యాగం చేస్తూ ఉండగా, ఆ పారిపోయిన దనుజుడు, వసిష్ఠుడు మిత్రసహుని ఇంటికి భోజనానికి వస్తున్నాడు అని తెలుసుకొని ముందుగా తాను వసిష్ఠుని రూపం ధరించి ఆ యాగమునకు వచ్చి మిత్రసహునితో తనకు నరమాంసముతో భోజనము పెట్టమని చెప్పి అక్కడినుంచి వెళ్ళిపోయి మిత్రసహుడి వద్ద సూపకారుడిగా చేరాడు. మిత్రసహుడు ఈ జరిగిన మోసం తెలియక వసిష్ఠుడే అలా కోరాడు అనుకొని తగిన ఏర్పాట్లు చేశాడు. వసిష్ఠుడు భోజనానికి రాగానే ఆ సూపకారుడు వసిష్ఠుడికి నరమాంసమును కలిపిన ఆహారం పెట్టాడు. వసిష్ఠుడు అది చూచి కోపించి మిత్రసహుని 'నీవు నాకు నరమాంసమును పెట్టావు కనుక నరులను భక్షిస్తూ రాక్షసుడవు కమ్ము' అని శాపం పెట్టాడు. దానితో మిత్రసహుడికి కోపం వచ్చింది. అతడు 'నీవే వచ్చి నరమాంసంతో భోజనము పెట్టమని కోరి, మళ్ళీ ఇప్పుడు ఏ పాపము ఎరుగని నన్ను ఇట్లా శపించటం న్యాయమేనా? ఇటువంటి నీవు ఇక సూర్యవంశపు రాజులకు గురువుగా ఉండకుండెదవుగాక అని శాపం పెట్టదలచి జలమును మంత్రించాడు.

ఇంతలో వసిష్ఠుడు ఏదో మోసం జరిగిందని శంకించి, తన దివ్య దృష్టితో దనుజుడు చేసిన మోసమును తెలుసుకొని పన్నెండు సంవత్సరములలో రాజుకు శాప విముక్తి అగునట్లు శాపావసానాన్ని అనుగ్రహించాడు. ఆ లోపల మహా పతివ్రత అయిన మదయంతి భర్తతో గురువులకు ప్రతిశాపం ఇవ్వటం అధర్మము అది తమకు శ్రేయము కాదని భర్తను వారించింది. అప్పుడు మిత్రసహుడు ఆ మంత్ర జలమును తన పాదముమీద పోసుకుని కల్మాషపాదుడైనాడు. ఆనాటి నుంచి అతనికి కల్మాషపాదుడు అనే పేరు వచ్చింది.

-సశేషం

# శ్రీకృష్ణ కర్ణామృతం

- సుశీలా ప్రసాద

**7శ్లో॥ కమనీయ కిశోర ముగ్ధమూర్తేః**
**కలవేణు క్వణితా దృతాననేన్దోః**
**మమవాచి విజృమ్భతాం**
**మురారే ర్మధురిమ్ణః కణికాZపి కాపి కాపి॥**

ఏం వీం తోచట్లేదు. పోనీ ఏదన్నా పనిచేద్దామన్నా మనస్కొప్పట్లేదు. వలలో చిక్కిన చేపలా గిజగిజలాడుతున్నాను. విసుగొస్తుంటే ఇంట్లోంచి బైటకొచ్చి, వాకిట్లో ఉన్న పారిజాతం చెట్టు మొదట్లో కూచున్నాను. సందేవేళ కావటాన చుట్టూ ఉన్న వస్తువులన్నీ మసకబారిన అద్దంలో కనబడే బొమ్మల్లా ఉన్నాయి. ఎంతో దూరంలో లేదు యమున. ప్రవహిస్తుంటే గలగలమని చప్పుడౌతూ 'నీకేం కావాలో నాకు తెలుసులే' అని కిలకిల నవ్వుతున్నట్లుంది. యమున గడుసుది. నాదీ, తనదీ ఒకటే మనస్సని కనిపెట్టినదిట్ట. రాత్రయే సరికి నది ఒడ్డున నందబాలుడు గోపెమ్మలతో అడే ఆటలు, పాడే పాటలు అన్నీ బాగా విచ్చుకున్న కలువ పూల కళ్ళతో ఆనందంగా చూస్తుంటుంది.

పొద్దుగూకింది. ముదురుతున్న చీకట్లు రెక్కలు విప్పుకొని వస్తున్నాయి. చీకటి నలుపు. కన్నయ్య నలుపు. తనలో జలక్రీడలాడినపుడు బాల గోపాలుని ఒంటి రంగు పులుముకుని యమున తానూ నలుపైంది. ఆకాశంలో అల్లి బిల్లిగా తిరిగే మేఘాలు కూడా నలుపే. బృందావనంలో అందర్నీ మురిపిస్తూ తిరిగే శ్యామసుందరుని మెరుపుల చూపులతో చూస్తూ ముచ్చట పడిపోతూ తమకీ వానికీ పోలికలు ఉండాలన్నట్లు అవి ఇంకా నల్లబడి పోతున్నాయి. అయితే ఇప్పుడా చిన్న బాలుడేం చేస్తుంటాడు? వనమంతా విరిసిన పూలవాసనలు పోగేసుకుని తిరుగుతూ నేనున్న పారిజాతం పూల పరిమళాలు మోసుకుపోతూన్న చిరుగాలి ఆగి చెవిలో గుసగుసగా ఊదింది 'యశోదమ్మ ఒడిలో' అని. మనస్సు ఆ గాలికన్నా వేగంగా పోయి నందరాజు భవనంలో వాలింది. అక్కడికి వెళ్ళిన వెంటనే అన్నీ చూడాలని మనస్సు కన్ను బాగా విప్పింది.

ఇల్లంతా దీపాలతో మెరిసిపోతున్నది. ఆ దీపాలకి అంత కాంతి ఎలా వచ్చిందా అని చూద్దునుగదా, తల్లి ఒడిలో ఒదిగి పాలుత్రాగుతున్న బుల్లి బుజ్జాయి ఒంటినుంచి వెలుతురు వలయాలు వలయాలుగా బయలుదేరి ఆ దీపాలన్నిటినీ వెలిగిస్తున్నది. వాడు పాలు తాగే పసివాడేనా? పాలిచ్చిన రాకాసి ప్రాణాలు తీసినా దాన్ని తల్లి స్థానంలో నిలిపి పరమ పదాన్నిచ్చిన పరమాత్ముడా? వాడి అసలు వయసెంత? నాలో భావాలను పసిగట్టినట్టు పాలుత్రాగుతున్నట్టు నటిస్తున్న

లీలాకిశోరుడు నవ్వుకుంటున్నాడు. పసిమి రంగు మేని చాయగల యశోదమ్మ ఒడిలో నల్లనయ్య బంగారు పువ్వులో నడి బొడ్డున పొదిగిన నీలమణిలాగ ఉన్నాడు. ఆ అందాలను చూస్తు మైమరచి పోతున్న వేళ. పాపం పెద్ద వయస్సు యశోదమ్మ పైట చెంగుచాటునున్న ఆ మాయా శిశువు అంతలో ఆవిడ కళ్ళ మీద నిద్ర తెరవేసి చట్టుక్కున మాయమైనాడు. కృష్ణుడేడీ! అని వెదుకుతూ బైటకి వచ్చాను.

అక్కడంతా చుట్టుకుని ఉన్న చీకటి అందాకా నక్కి దాక్కుని, అప్పుడింక దొంగలా తక్కుతూ తారుతూ నల్లనయ్య జాడలు తీస్తూ వెంబడించినట్టుంది "నువ్వు నన్ను పట్టగలవా? సాహసించి నా దగ్గిరకొస్తే ఇంక నువ్వుంటావా?" అని అంటున్న నీలమోహనుని ఎదిరించలేని బెదిరింపు విన వచ్చిన దిక్కుగా చూడగా అటుగా పెద్ద వెలుగు కనిపించింది. 'నీ మాటల్లో నిజమెంతో తేలుస్తా'నంటూ మూర్ఖంగా ముందుడుగేసిన చీకటి తెల్లమొహం వేసి ఆ వెలుగులో కలిసిపోయింది.

ఎంత దూరం ఎగిరివెళ్ళినా తిరిగొచ్చిన పక్షి గూటికి చేరినట్టు నా మనస్సు మళ్ళీ వచ్చి శరీరంలో దూరింది. 'మావంతు పనిచేయడానికి మేమూ ఉన్నాం' అంటూ చెవులు తయారయేసరికి... అలవోకగా గాలి అలలపై తేలివస్తూ చెప్పలేనంత తీయగా పిల్లనగ్రోవి పాట వీనుల విందుగా వినవచ్చింది. తన స్వామి పెదవులపై నుంచి పలికించే ఏ మాటైనా ఆదరంగా వేదంలా వినిపించే ఆ మురళీరవం ఎందరి హృదయాలను తాకి పరవశింప చేస్తోందో! ఎందరికి దారి చూపుతోందో? ఎందరిని చల్లగా పిలిచి నల్లనయ్య చెంతకు చేరుస్తుందో! తానే సర్వమని నమ్మి వచ్చిన వారిని ప్రేమమూర్తి అయిన బృందావన బాలుడు తనలో లీనం చేసుకునేందుకు సాయపడుతున్నదో!

ఇంతదాకా వేగిపోతున్న తనువు మనస్సు క్షణమొక యుగంలా గడుపుతూ వేచిచూస్తున్న ఈ వేళ, ఆ మధుమురళీగానం వినరాగానే సమయం వచ్చిందని లేచాను. పైన ఆకాశం నిండా నల్లని మబ్బులు, చుట్టూ ముసిరిన చీకట్లు ఇవేవీ లెక్క చేయకుండా అడుగులేస్తూ ముందుకి నడిచాను. నా మనోనాథుడైన బాలగోపాలుని త్వరగా, త్వరగా చేరాలనే ఆశ నాకు దారి చూపుతోంది. అమితమైన తన మీది ప్రేమ చీకటి పోగొట్టే వెలుగై చెయ్యి పట్టి నడుపుతోంది. నాలాటి వారంతా కోరుకునే బ్రహ్మానందకరమైన చిన్ని కన్నయ్య సన్నిధి చేరి తననే చూస్తూ......

నీలి కలువరేకులవంటి ఒంటిరంగు, కమ్మని వేణువు నిండు పున్నమి జాబిల్లి వంటి మోము, మా వ్రేపల్లెకు ప్రాణమైన ముద్దుల బాలగోపాలుని సాటిలేని అందచందాలలో గోరంతైనా కొండంత చేసి చెప్పగల మాటలను వరంగా కోరుకోనా?....

-సశేషం

# మౌనధ్యాన సప్తాహశిబిరం

(గత సంచిక తరువాయి) -రమణ ప్రసాద్

**ఎవరికి తెలియగ తరమౌను బాబును**
**ఏ దేశమందుము, ఏ కాలమందుము**
**ఆకాశమునకేది దేశము, కాలము**

అన్నిటి కన్నా పుట్టడం పెద్ద దోషం అనుకొంటాం. కాని లబ్ధి కూడా ఉన్నది. "జరిగిన దాని గురించి బాధ పడమని చెప్పలేదు. సరే! మానవ జన్మ వచ్చింది. దాని నుంచి బయట పడాలి'' అన్నారు గురుదేవులు.

జన్మలదాకా అక్కరలేదు. ఇప్పుడు మనకి వచ్చే సుఖాలు ఎంత సేపు నిలబడుతున్నాయి? ప్రతీదీ క్షణికమే కదా! క్షణికమైన వాటిలో మార్పు లేనిది ఒకటి ఉంది. అది పరమాత్మని బోధ.

**మదిలో నీదగు మూర్తి నిల్పుకొని సంభావింతుమేగాని ని**
**న్నద మిత్థంబని నిర్ణయింప వశమా? ఎవ్వారికిన్, నమ్మి నీ**
**పద రాజీవము లాశ్రయించితిమి లోపంబేమి? నీవారమే**
**గద రక్షింపక నీకు తప్పదు కదా! కాళీ ప్రసాద ప్రభూ ॥**

భగవంతుని గురించి వర్ణించటానికి కాగితం కలంతో చెప్పలేము. సముద్రం అంతా ఇంకుగా చేసి, ఆకాశమంత కాగితం మీద భగవంతుని గురించి చెప్పాలంటే కూడా చాలదు. అది అనందము, అఖండము. నీ పాదాలను ఆశ్రయించాం. మాకు లోటేమిటి? ఎవరి వాళ్ళం మనం? నీవారమే కదా! మరి మనం అది ఎంత వరకు నిలబెట్టుకుంటున్నాం? పిల్లల దగ్గర నుంచి ఫోను వచ్చినా బెంగే. రాకపోయినా బెంగే. ఎందుకు రాలేదు అని. కాటికి కాళ్ళు చాచినా బెంగే. ఇప్పుడు వానప్రస్థాశ్రమాలు చాలా వచ్చాయి. మావంటి వారిని వాళ్ళకు ఏమైనా చెప్పమంటారు. నేను "అమ్మా! మీ ఇంటి నుంచి ఎవరూ రారా? అంటే, అయ్యో వచ్చారండీ'' అంటారు. సరే సంతోషం. ఇంకా వారి దృష్టి ఇంటిపైన సంసారం మీదనే ఉంటుంది. మనని ఎవరు పంపారు? ఎవరికి ఉండాలి బంధన? మనం మహాత్ముల వద్దకు వచ్చాం. ఇక్కడకు వచ్చాక కూడా ఇంకా వెనుదిరుగుతావా? ప్రపంచ దృష్టి వదులు, ఊర్ధ్వ దృష్టి ఉండాలి.

''రామా ! నీ వారము కామా? సకలలోకాభిరామా'' అని పాడుకున్నాడు. రామదాసు. ఆధ్యాత్మిక దృష్టి అలవరచుకోవాలి. ఏ విద్యావాసన లేని గోపికల నోట ఒకే మాట, కృష్ణుడి గురించిన మాట. మరి భగవంతుడికి

రక్షింపక తప్పదు కదా! అలాగే గురుదేవులైనా. వారి కృప చేతనే ఇలా ఇక్కడ నిలబడగలిగాం. ప్రతి విషయంలోను మనస్సు ప్రకృతికి దాస్యం చేస్తోంది. కాని అదే భగవంతునిపై నిలిస్తే అదే ధ్యానం.

ఆకాశమునకు ఏది దేశము? కాలము? ఇది గురుదేవుని ముఖస్థగా వచ్చిన కీర్తన. ఆకాశంలో ఏమీ లేదు. మన ప్రభువు కూడా ఆకాశం వలె ఉన్నారు. రెండు దేశాలు కలసి ఉన్నాయా? రాష్ట్రాలు ఇంకా కావాలనే మన దేశం కూడా ఇంతే. మానసిక బాధలను ఇంకా రెచ్చగొట్టాలని చూస్తుంది. దిగజారిపోకూడదు. ఊర్ధ్వ దృష్టి కలిగి ఎగరాకాలి. గ్రద్ద పైన ఎగురుతూనే ఉంటుంది. కాని దాని దృష్టి శవాలపైనే ఉంటుంది. మనకు శరీర దృష్టి ఉండ కూడదు. అంటే దేహాభిమానం ఉండకూడదు అన్నమాట.

అర్జునుడి సంగతి చూద్దాం. తనకు కలిగిన ఆవేదన అంతా అసలైన ప్రభువు సన్నిధిలో వెళ్ళబోసుకున్నాడు. మనకు ప్రతినిధిగా ప్రశ్నలు వేశాడు. సమాధానాలు పొందాడు. అదే గీతాచార్యుడు అందించిన భగవద్గీత. ఆచంద్రార్కం సాధకులందరికీ అందుబాటులో ఉన్నది.

శ్రవణ మనన నిదిధ్యాసలు అలవరచుకోవాలి. మనం వింటాం. విన్న విషయాలను ఎంత వరకు మననం చేసుకొంటున్నాం? ఇక్కడ నుంచి వెళ్ళాక ఎంత మననం చేస్తున్నాం. మననానికి రావటం లేదు అనేవాడు అధమాధముడు. అది కూడా తేలిక అయిన మాట. అందు చేతనే విన్న విషయాన్ని తిరిగి మననం చేసుకోవాలి. విచారణ చేయాలి.

ధ్యానం చేస్తున్నా సంతోషంగా చేయండి. ధీరులుగా ఉండాలి. సుందరకాండలో వస్తుంది. రావణాసురుడు సీతను బెదిరించాడు. రెండు నెలలు గడువు ఇచ్చాడు. హనుమంతుడు పైనుంచి వింటున్నాడు. సీత వద్దకు త్రిజట వచ్చి స్వప్నం వచ్చింది. మంచి జరగనున్నది అని చెప్పింది. అమ్మవారి ఎడమభుజం అదిరింది. ఎడమ కన్ను కూడా అదిరింది. అప్రయత్నంగా నవ్వింది. ఫలితం మనదే. చేసే ప్రయత్నం ఆనందంగా చెయ్యాలి. ఈ సమయం నాది. నా గురించి నేను చేసుకుంటన్నాను. దేవుడు నావాడు - అని నమ్మి పట్టుదలతో సాధన చేయాలి.

దేహ భావన తొలగించుకుంటేనే జగత్తులో గెల్చినవాళ్ళమవుతాం. కష్టాలు రానవసరం లేదు. ఒకవేళ వచ్చినా తగిన ప్రిపరేషన్ ఉండాలి. అంటే భక్తి, జ్ఞానం అలవరచుకోవాలి. ఈ జీవితమే లేకపోతే భగవంతుడు ఎక్కడ ఉన్నాడో ఏం తెలుస్తుంది?

-సశేషం

# మాతాజీ బోధామృతం

(గతసంచిక తరువాయి)

- శివ ప్రసాద్

రేపు ఉన్నదా? అంటే గ్యారంటీ లేదు. ఒక్కటే గ్యారంటీ ఉన్నది. అదే గురుకృప. ఆయన నిర్హేతుక జాయమానమైన కరుణ. ప్రపంచంలోవన్నీ అవసరార్థ ప్రేమలు. మొదట రెండుపళ్ళు తీసికొని వెళ్తారు. దర్శనం కాకపోతే, మర్నాడు మళ్ళీ పళ్ళురావు. భగవంతుడు మిమ్మల్ని పళ్ళు ఇమ్మన్నాడా? ఆయనకు మీ కల్మషరహితమైన మనస్సు కావాలి. ఏ మనస్సు నామధారణ చేసి ఉంటుందో, అటువంటి మనస్సు కావాలి. ఆ నామానికి ఏదో రూపం ఉంటుంది. మా అన్నయ్య అమెరికాలో ఉన్నాడు అనగానే, ఆ అన్నయ్య రూపం గుర్తువస్తుంది. ఇవ్వాళ మామ్మ పోయింది అనగానే ఒక వంగి పోయిన ఒక ముసలామె రూపం గుర్తువస్తుంది. ఆమె లోకాభిరామాయణం మాట్లాడేది కాదు. చక్కగా బోధ విని, విన్నదానిని మననం చేసుకొనేది. పొదుపు అనేది ఆమె దగ్గరే నేర్చుకోవాలి. "వాళ్ళింట్లో అది ఉంది, మనింట్లో అది లేకపోతే ఎలా? అని ఆమె ఎప్పుడూ అనుకోలేదు. ఎప్పుడైతే ఒకళ్ళు కావాలి అని, ఇంకొకరు వద్దని అంటారో, అప్పుడే గొడవ వస్తుంది. ఇదంతా బయట చూపు. మనం లోపలకు చూడాలి. మనకు కావలసింది ఆనందం. ఎటువంటి ఆనందం కావాలి? వచ్చే పోయేది కాదు. నిత్యమైనది కావాలి. కాని మనం తాత్కాలిక సుఖాలకోసం వెంపర్లాడుతున్నాము.

కొందరికి ఫ్రైడ్‌రైస్ (fried rice) అంటే ఇష్టం. నాలుగు రోజులు తిందాం అనుకున్నారు. తీసి పెట్టి, తీసిపెట్టి, మూడవరోజున వాసన వచ్చింది. ఇక అప్పుడు దానిని తినగలరా?

మనలో ప్రాణరూపంలో చైతన్యం ఉండబట్టి, నేనున్నాను. నీవు ఉన్నావు, వారు ఉన్నారు. అన్నీ తెలుస్తున్నై. ప్రాణం కనిపించేది కాదు. డాక్టరు, పేషంట్ బ్రతికితే నా గొప్ప అంటాడు. వాడు పోతే, మేము చెయ్యవలసింది అంతా చేశాము అంటారు. అల్పాయుష్కుడైన మార్కండేయుడికి చిరంజీవిత్వాన్ని ఇచ్చింది పరమేశ్వరుడు. ఆంజనేయుడికి శ్రీరామచంద్రుడు. మరణం శరీరానికే అన్న సత్యాన్ని బ్రతికి ఉండగానే మనస్సు తెలుసుకోవాలి. వాళ్ళకు చావులేదు.

**నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః**
**నచైనం క్లేదయంత్యాపో నశోషయతి మారుతః**

అటువంటి ఆత్మతత్వాన్ని సాధకుడు అనుభవించాలి. ఎప్పుడు అనుభవించాలి? ఈ ప్రపంచంలోని వాటిని అనుభవిస్తున్నప్పుడు, వాటిలో అంతర్యామిగా ఉన్న ఆత్మను గుర్తించి తత్వాన్ని అనుభవించాలి. నిత్య వస్తువని గురుదేవుడు జాగ్రదవస్థలో అనుభవింప చేస్తాడు.

నీవు నిజంగా అనుభవించావా? అనుభవించానని చెప్తున్నావా? గురుదేవుడు ఒక్కటే చెప్పారు. మనసు అర్పణ చేసిన తర్వాత నీవు మనస్సులో ఏదీ దాచకూడదు. గురుదేవుడికి తెలియక కాదు. దాచుకుంటే తరువాత నీవు ఆబాధకు తట్టుకోవటం కష్టం. ఆయనను తిట్టాలనుకున్నా, ఆయనకు చెప్పు, సంతోషిస్తాడు.

దీనినే తేలికగా అందించాడు పోతన మహాత్ముడు -

**ఎవ్వని చే జనించు జగమెవ్వని లోపల నుండు లీనమై**
**ఎవ్వని యందు డిందు పరమేశ్వరుడెవ్వడు మూలకారణం**
**బెవ్వడనాది మధ్య లయుడెవ్వడు సర్వము తానయైనవా**
**డెవ్వడు వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వేడెదన్**

నువ్వు శరణు పొందితే నాకు తృప్తి లేదు. నేనే శరణు పొందాలి. కొంత మంది నేను పూజ చెయ్యనండీ, నా బదులు కూడ మా ఆవిడే పూజ చేస్తుంది అంటారు. లేకపోతే క్లబ్బుల వెంట తిరిగే ఆవిడ, నా బదులూ మా ఆయన బదులు కూడ ఆయనే పూజ చేస్తారండీ అంటుంది. ఒకళ్ళు పూజ చేస్తే ఇంకొకళ్ళని పూజ చెయ్యటం మానమని కాదు. ఒకళ్ళు తింటే ఇంకొకళ్ళ కడుపు నిండదు. తత్వాన్ని గుర్తించాలి. క్రియలో ఈర్ష్య అసూయ వంటివి చాలా ఉంటాయి. అందుకే జాగ్రత్త అవసరం.

నీ మనస్సు యొక్క లోకువే నిన్ను హీనంగా చేస్తుంది. నీ మనస్సులోని సద్భావనే నిన్ను భగవంతుడి వైపు తిరిగేలా చేస్తుంది. నీలో మధురమైన భావనలు ఉంటే మధురాధిపతి అక్కడే ఉన్నాడు.

వారు ఏ మంత్రాన్ని ప్రసాదించారో అది నిప్పువంటిది. దానిని వినటం కాదు, చదవటం కాదు, దానిని హృదయంలో ధారణ చెయ్యాలి. దానిని హృదయంలో ధారణ చేస్తే అక్కడ ఇంకొక దానికి స్థానం ఉంటుందా? మనలోని వెర్రి భావనలే మనను వెక్కిరిస్తున్నాయి. సర్వ ప్రపంచమూ నీవంటిదే అని

గుర్తించక విమర్శించుకుంటే ఎవరు ఎవరిని విమర్శించుకున్నట్లు, ఎద్దేవా చేసినట్లు. నిన్ను నీవే. తెలివిలేక అలా చేస్తున్నారు కాని, నిజంగా తెలిసినవాడు, ఈర్ష్య, అసూయలలో పడడు.

ప్రభువు తత్వాన్ని గుర్తించాలి అనుకున్నవారు ముందుగా

**అనన్యాశ్చింతయంతోమాం యేజనాః పర్యుపాసతే**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం ॥**

అని భగవద్గీతలో చెప్పినట్లు, గురుదేవులను అనన్యంగా చింతన చేయాలి. ఉపాసన చేయాలి. గురుదేవులు తప్ప అన్యం లేదు అని దృఢంగా నమ్మాలి. రాముడిది ఒక్కటే మాట. ఒకటే బాణం. ఒకే పత్ని. మనకూ ఒక్కటే భార్య, మనస్సు. భార్య భర్త మాట వినాలన్నా, భర్త భార్యమాట వినాలన్నా ముందు మనస్సు వినాలి. ఎందరు మహాత్ములు చెప్పినవి విన్నా, మనం ఆశ్రయించటం మాత్రం ఒకే గురుపాదాన్ని ఆశ్రయించాలి.

గురుపూర్ణిమ అంటే నిండైనది. పూర్ణిమనాటి చంద్రుడు ఎలా పరిపూర్ణమైన వెలుగును, చల్లని కాంతిని ఇచ్చి రంజింప చేస్తున్నాడో, నా గురుదేవులు అలా నన్ను రక్షిస్తున్నారు అనే భావన సంపూర్ణంగా ఉండాలి. సద్భావన కలిగి ఉండాలి. మనస్సులో సత్సంకల్పాన్ని కలిగి, నిరంతర గురు భావనతో మన జీవితాన్ని సార్థకం చేసికోమని గురుదేవులు హెచ్చరిస్తున్నారు.

**న గురోరధికం నగురోరధికం**
**శివశాసనతః శివశాసనతః**
**న గురోరధికం నగురోరధికం**
**శివశాసనతః హరిశాసనతః ॥**

గురుపాదాన్ని ఆశ్రయించిన తర్వాత ముఖ్యంగా గుర్తించవలసింది గురువు కన్నా అధికమైనది లేదని. దానిని అనుభవించాలి. చదువుకోవటం కాదు, అనుకోవటం కాదు, తెలుసుకోవటం అంతకంటెకాదు. అయిపోవాలి. మనస్సు అయిపోవాలి, అనుభవించాలి. దీనిని ఎవరండీ చెప్పింది? ఇది నా అనుభవం. గురుగీతలో చెప్పబడింది కదా? అవును చెప్పబడింది, కాని ఇది నేను అనుభవిస్తూ చెప్తున్నాను. గురువు నిర్గుణ, నిరాకార స్వరూపుడు. మనం ఈ దేహాన్ని దాటలేక పోతున్నామని పోనీ, నేనూ నీలాగానే వచ్చి తెలియజేస్తాను అని మనను అనుగ్రహించటానికి ఒక దేహాన్ని ధరించినట్లుగా మనతో సంచరిస్తున్నట్లుగా అవతరిస్తారు.

- సశేషం

# మాతాజీ సత్సంగ్ డైరీ

(గతసంచిక తరువాయి) -రమణ ప్రసాద్

ఇప్పుడు గబగబానడుస్తున్న నడక ముందు ముందు ఉండకపోవచ్చు. ఏ మంచం పట్టటమో కావచ్చు? హాస్పిటల్‌లో చేరవలసిరావచ్చు. ఎవరైనా ఉండకపోతారా ఆసరా ఆ సమయానికి అనుకుంటున్నారా? బెడ్‌రిడెన్(Bed Ridden) కావచ్చు. నిన్ను ఎవరైనా బెడ్‌రిడెన్ కమ్మన్నారా? పడుకోమన్నారా? నీకు స్వతంత్రంలేదు. నీకు పని చేసే శక్తిని ఇస్తున్నది నేనే అంటున్నాడు భగవంతుడు.

ఒక్కొక్కప్పుడు తెల్లవారుజామున లేవలేము. శక్తి ఉండీ చెయ్యకపోతే దోషం. శక్తి లేనప్పుడు చెయ్యాలని పరుగెత్తితేకూడ దోషమే. తెల్లవారుజామున నిద్రపోకుండా ఉండే స్థితిలో ఈ దేహాన్ని పెట్టారు గురుదేవులు. తెల్లవారు జామున ప్రార్థనచేసి తరువాత కావాలంటే పడుకో అన్నారు. ఒకవేళ రాత్రి ప్రొద్దుపోయేదాక మేలుకొని ఉంటే ఇంకా మెలకువగానే ఉన్నావా? పడుకో అంటారు. మనకు అప్పుడు మనస్సు లేచికూర్చుంటింది. ఇన్‌పుట్(Input) స్టార్ట్ (start) ఔతుంది. కాఫీ, టీలతో వదలం. టిఫిన్‌కూడ ఉంటే బాగుంటుంది అనిపిస్తుంది.

మనకు బాగా లేనప్పుడు మనం ఉన్నచోటనే కూర్చొని ప్రార్థన చేసుకోవచ్చు. మరీ లేవలేకపోతే సుఖాసనంలో, అవసరమైతే పడుకొనే శవాసనంలో (గురుదేవులు దానిని గోవిందాసనం అనేవారు) ప్రార్థన, ధ్యానం చేసికోవచ్చు. కాని మనం మాత్రం రాత్రి ఎంత ప్రొద్దుపోయేదాక అయినా సరే, ఆఖరుకు తెల్లవారుజాము అయ్యేదాక అయినా సరే మేలుకొని కూర్చుంటాముగాని, తెల్లవారుజామున లేవాలంటే మాత్రము లేవము.

ఆ వెంకటేశ్వరస్వామి కూడ తెల్లవారుజామున లేస్తాడు. భక్తులను పరుగెత్తిస్తాడు. నిద్రపోనివ్వడు. మనస్సు ఆరోగ్యం బాగుంటే, శరీరం పడుకున్నా మనం పడుకోము. పోయే విషయాలను గురించి నీవు ఆలోచిస్తుంటే నీకు పోయేకాలం దగ్గర పడుతుంది. అనవసరమైన విషయాలమీద విరాగం, భగవద్విషయంమీద అనురాగం కలిగినప్పుడు, అప్పుడు నీకు శమాది షట్కసంపత్తి అంటే శమము, దమము, తితీక్ష, ఉపరతి, శ్రద్ధ, సమాధానము ప్రసాదిస్తాడు భగవంతుడు. ఎందుకు ప్రసాదిస్తున్నాడు? మనలో వాసనలు ఉన్నై. అవన్నీ, కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము అనే అంతశ్శత్రువుల రూపంలో మన ఆయుఃకాలాన్ని భక్షిస్తున్నాయి. మనలోని

జ్ఞానమనే రత్నాన్ని అపహరిస్తున్నాయి. పెద్దలు ఏమన్నారు?

కామం క్రోధం చ లోభం చ దేహే తిష్ఠతి తస్కరాః।
జ్ఞాన రత్నాపహారాయ తస్మాత్ జాగ్రత జాగ్రత॥

దొంగవాడి ప్రవర్తన ఎలా ఉంటుంది? వాడూ మనలాగే కనపడుతూ మనతోనే కలిసి తిరుగుతూ, అనువైన సమయంకోసం వేచి చూస్తాడు. అవకాశం దొరకగానే దొంగిలిస్తాడు. అలాగే మనలోని కామము, క్రోధము, లోభము అనే దొంగలు మన దేహంలోనే ఉంటూ, అవకాశం దొరకగానే, మనలోని జ్ఞానమనే రత్నాన్ని దొంగిలిస్తున్నారు.

మన శరీరంనుండి ఎన్ని మలినాలు బయటకుపోతున్నాయో. పూర్వం మలం బయటకు రాకపోతుంటే, ఆముదం త్రాగేవారు. అయితే దానికి వివేకం లేదు. అది అయినదానిని, కాని దానిని అన్నింటిని బయటకు పంపేస్తుంది. మనం స్వీకరించిన ఆహారం వాయువుల ద్వారా శరీరానికంతా పంచ బడుతున్నది. అనవసరమైన పిప్పిమాత్రం బయటకుపోతున్నది. మన పెద్దలు ఈ శరీరాన్ని అప్పుడప్పుడు ఆయిల్ చెయ్యాలి అని కాస్ట్రాయిల్ పెట్టారు. అది లోపల ఉన్న మలాలతో సహా అన్నింటినీ మంచివాటిని, చెడువాటిని కూడ బయటకు పంపిస్తుంది. చివరకు అది కూడ బయటకు వస్తుంది. అయితే ఇప్పుడు ఎవ్వరూ ఆముదం త్రాగటంలేదు. దానికీ మందులు తాగుతున్నారు. ఇప్పుడు మనకు వివేక దృష్టివచ్చింది. మంచిని అట్టేపెట్టుకొని, చెడును వదిలేస్తున్నాము.

కామము అంటే కోరిక. గారెలమీద కోరిక కూడ కామమే. అవి లభించకపోయినా, తినలేక పోయినా వెంటనే కోపం వస్తుంది. దేనినైనా సాధించ లేకపోతే దానిమీద కోపం వస్తుంది. సాధించిన తరువాత మనకిష్టమైన దానియందు లోభదృష్టి కలుగుతుంది. అప్పుడు దానియందు మహామోహం కలుగుతుంది. యుద్ధరంగానికి వచ్చి అందరిముందు నిలబడకముందు అర్జునునికి వ్యామోహం లేదు. 'బావా! తీసికెళ్ళు' అన్నాడు. 'నన్ను తీసికొని వెళ్ళి వాళ్ళముందు నిల్చోపెడితే ఎవరెవరు ఉన్నారో, అందరినీ ఒకసారి చూస్తాను' అన్నాడు. 'ఆ' బాగా చెప్పావు. దా. చూడు అని పార్థసారథి అర్జునుణ్ణి యుద్ధరంగం మధ్యలో శత్రుసైన్యం ఎదురుగా నిలబెట్టాడు. ఎదురుగా భీష్ముడు (తాతగారు), ద్రోణుడు, (అస్త్ర గురువు), దాయాదులు ఇలా అంతా కావలసిన వాళ్ళు కనిపించారు. తీరా పరాయివాడు ఎవరైనాడు? తీసికొని వెళ్ళినవాడు. తీసికొని వెళ్ళమనేదీ మనమే. తరువాత అనేదీ మనమే. -సశేషం

## శ్రీ బాబూజీ దివ్యవాణి

అతి ప్రాచీకాలంనుంచీ కూడా మనదేశములో గొప్ప సంప్రదాయం పాటింపబడుతూ ఉండేది. రాజ్యాలు యేలే ప్రభువులు ఎంత సమర్థులూ, విద్యావంతులూ అయినా తమ గురువుల ఆదేశాలను గ్రహించి తదను సారంగా నడుచుకుంటూ ఉండేవారు. ఈ గురువులు శాస్త్ర విజ్ఞానంలో పరమ నిష్ణాతులై యుండుటేగాక, ఆత్మసాక్షాత్కార పూర్వకమైన ఆధ్యాత్మికానుభవ సంపత్తి సైతం కలిగి ఉండేవారు. పరిపాలనకు సంబంధించిన ముఖ్య వ్యవహారాలలో దేశప్రభువులీ మహాత్ములను సదా సంప్రదిస్తూ పటిష్ఠమైన ధర్మ పరిపాలన నిమిత్తమై వారి ఆశీర్బలంతో రాజకార్యాలు నిర్వహిస్తూ ఉండేవారు.

ప్రజలు వారి పరిపాలనలో శాంతి సమృద్ధులు కలిగి జీవిస్తూ ఉండేవారు. మహాత్ముల మనోవాక్కాయ కర్మ లెప్పుడునూ సర్వజన శ్రేయోదాయకాలుగానే ఉంటాయి. నిస్వార్థమైన త్యాగమయ జీవితం వారిది. ఆందువలననే వారి సలహాలు అన్ని కులమతాల ప్రజలకూ ఆమోదకరంగా ఉండేవి. వారి ఆచరణననుసరించియే ప్రభువులు కూడా తమ ఆశయాలనూ, నడవడినీ సరిదిద్దుకుంటూ ఉండేవారు.

మహాత్ముడైన చాణక్యుని మేటి ఉపదేశాలను అత్యంత శ్రద్ధతో పాటిస్తూ వచ్చినందువల్లనే చంద్రగుప్త సార్వభౌముడు ఘనకీర్తి శిఖరాలు అందుకో గలిగాడు. బుద్ధదేవుని అడుగుజాడలలో నడువ యత్నించినందు వలననే అశోకుడు, హర్షుడు మున్నగురాజన్య శ్రేష్ఠులకు ఈ దేశ చరిత్రలో మహోన్నత కీర్తిస్థానం లభించింది.

ప్రతాపరుద్రదేవుని మహామంత్రియగు యుగంధరుడు తన ప్రతిభా విశేషంచే ఢిల్లీ సుల్తాను చెరనుండి తన ప్రభువును రక్షించుకోవడమే కాక, కాకతీయ సామ్రాజ్య ఘనతను ఉన్నత శిఖరాలకు చేర్చినాడు. అట్టివారి అడుగు జాడలను శ్రద్ధగా అనుసరించినందువల్లనే రాణి రుద్రమదేవి సాటిలేని వీరనారిగా దేశచరిత్రలో అసదృశ కీర్తి సంపాదించుకున్నది.

కుక్కగొడుగులవలె మొలచుకుని వచ్చిన అనేక మతభేదాలకు ఆలవాలమై దేశం గందరగోళంలో పడి సంకుచిత బుద్ధులైన వివిధ రాజ్యాధినేతలు పరస్పరం కలహించుకుంటూ ఈ మత స్వార్థపరుల చేతులలో కీలుబొమ్మలై శాంతి భద్రతలు లేని అరాజక స్థితికి దేశమును

ఈడ్చుకుని పోయినప్పుడు శ్రీ శంకర భగవత్పాదులవతరించి భారతజాతి నా దుస్థితినుండి ఉద్ధరించి, జగద్గురు పీఠమున దానికి సుస్థిరత్వాన్ని కల్పించారు.

నిజంగా ఆయన యుగపురుషుడు, ద్రష్ట, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు కూడ. విరాట్పురుషునివలె ఆయన సహస్ర బాహువులతో చిల్లర మతాలన్నింటినీ నిర్మూలించివైచి, విశ్వజనీన అద్వైత మహాసామ్రాజ్యమును సుప్రతిష్ఠిత మొనర్చినాడు. శక్తిమంతము, ఐక్యసంధాయకమునైన యీ సామ్రాజ్య ప్రభావంచేత కుల, మత, జాతి, నామ, రూప, లింగ విభేదభావములు, అసూయా ద్వేషాలు నిర్మూలించబడి సకల మానవులకూ ఒకే మతం, ఒకే సంధి, ఒకే దైవం, రూపొందించబడుట సంభవించినది.

ఈ ఐక్య సంఘటన ఎంత సర్వసమగ్రమనిన జగత్తులోని చేతనా చేతనవస్తుజాలమంతా బ్రహ్మముతో సర్వగత ఆత్మచైతన్యంతో తాదాత్మ్యమున విలసిల్లినవి. ఆ ఆత్మచైతన్యముకంటే భిన్నమైన రెండవ వస్తువేదియునూ లేదు. ప్రపంచ మానవులందరికీ ఒకే జాతీయత, ఒకే మతం, ఒకే ప్రభుత్వం స్థాపించగోరే నేటి మేధావులు తత్త్వవేత్తలు, కనే కలలు శ్రీ శంకర భగవత్పాదుల వలన ఈ రీతిగా ఏనాడో సిద్ధించింది.

కాని, ఆ మహాసామ్రాజ్యమిప్పుడేమైనది? స్వార్థపరులు, క్రూరచిత్తులు, విషబుద్ధులూ, లుబ్ధాగ్రేసరులూ అయినవారి విషమ ప్రవృత్తుల ఫలితంగా చిన్నాభిన్నమై రూపు రేఖలనే కోల్పోయినది. దీని ఫలితంగానే పాలకులు దురాశాపరులు, పాలితులు లోపభూయిష్ట జీవనులు అయినారు. దౌర్జన్యం విజృంభించినది. స్వార్థం పరాకాష్ఠనందుకున్నది. అంతటా అల్లకల్లోలమే. ఎచ్చటనూ క్రమశిక్షణమనేది కానరాదు.

ఇదే పరిస్థితి ఇంకే దేశంలో ఏర్పడినా, ఆ దేశానికి సర్వవినాశమే సంఘటిల్లి ఉండేది. కాని, అదృష్టవశాత్తూ, మన దేశాని కట్టి విపత్తు సంభవించబోదు. ఏలనంటే, ఈనాడు మన దేశంలో మహాత్ములూ, మహాభక్తులు, మహాజ్ఞానులూ, మహా పతివ్రతలూ, మహా శీలసంపన్నులు ఉన్నారు. సత్యశుద్ధితో కూడిన వారి ప్రార్థనలు స్వార్థరహిత సేవా ప్రవృత్తులు, దివ్య శుభాశిషములు మన దేశమును తప్పక కాపాడుతూ ఆపన్నివారకము కాగలవు. చరిత్ర ఈ రీతిగా పునరావృత్తం కావడం అనేది మన దేశానికి పరిపాటియేనన్నారు శ్రీ హనుమత్ కాళీ వరప్రసాద బాబు. *

# సమర్ధ సద్గురు నాధుని దివ్య చరిత్ర

(గత సంచిక తరువాయి) - స్వామి విజయేశ్వరానంద ప్రసాద్

మరొకసారి ఒక మహారణ్యంలో ప్రయాణిస్తూ సొమ్మసిల్లినప్పుడు బోయ దంపతులిద్దరు వచ్చి స్వామిని తమ కుటీరమునకు తీసికొని వెళ్ళి, మంచంపై పరుండబెట్టి శీతోపచారములు చేసి గంజినిచ్చి పరిచర్యలు చేశారు. సంతానహీనులైన ఆ దంపతులు శ్రీ బాబును తమ కుమారునివలె భావించి, ప్రేమతో ఆదరించారు. స్వామి ఎంతో ప్రసన్నులై, వారికి ఆనందాన్ని కలిగించి, కొన్నాళ్ళ తరువాత ప్రయాణమైనారు. ఆ దంపతులెంతో దుఃఖపడుతూ "ఇంత పసివాడవు, నీకెవరూ లేరా? ఎందుకు ఇలా భయంకరమైన అరణ్యాలలో తిరగటం? మాతో ఉండిపో బాబూ! మాకు బిడ్డలు లేని లోటు తీర్చిన వాడవవుతావు. మా కుమారునిగానే నిన్ను చూసుకుంటాము'' అని బ్రతిమాలారు. స్వామి చిరునవ్వుతో "నాకు ఎవరూ లేకపోవటమేమిటమ్మా? ఇప్పుడు ఈ అరణ్యంలో మీరు నాకు తల్లి తండ్రులై ఆదుకున్నారు. అలాగే మనం ఎక్కడికి వెళ్ళినా, ఏం చేస్తున్నా కాపాడే మన తండ్రి ఒకడున్నాడు. ఆ తండ్రిని చేరుకోగలిగితే జీవితం ఇక ఆనంద మయమే అవుతుంది. ఆ తండ్రి దగ్గరికే బయల్దేరాను. నేను చెప్పినట్లు మీరు చేసుకుంటే మీరూ ఆ తండ్రిని చేరుకోగలరు'' అని వారికి తరించే మార్గాన్ని బోధించి స్వామి ముందుకు సాగారు.



శ్రీ బాబు కొన్ని దినములు ఒక కొండగుహలో ఉండి తపస్సు చేసుకునే వారు. ఒక మహాసర్పము దివ్యకాంతులతో, సుగంధ పరిమళాలను వెద జల్లుతూ, ఆ గుహలోనికి వచ్చేది. శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామియే కరుణా నిధియై, తమకు దర్శనమివ్వ వచ్చినట్లు అనుభూతిని పొందేవారమని శ్రీ బాబు చెప్పారు. ఆ సర్పం కూడ ఆ గుహలోనే నివాసం చేస్తూ ఉండేదని చెప్పారు.

శ్రీ బాబు ఎన్నో పర్యాయములు శ్రీశైలమునకు ఒంటరిగాను, భక్తులతోను యాత్ర చేశారు. ఆ రోజులలో శ్రీశైలం కొండపైకి బస్సులు లేవు. కాలినడకన వెళ్ళవలసి వచ్చేది. అరణ్య మార్గమవటం వలన, క్రూరమృగాల బెడద

ఎక్కువగా ఉండేది. అందువలన యాత్రికులు కొంతమంది కలిసి ఒక జట్టుగా ప్రయాణం చేసేవారు. అక్కడక్కడ మజిలీలు చేసి అందరూ వంటలు చేసుకొని భోజనం చేసేవారు. రాత్రులందు ఒకచోట విశ్రమించేవారు. క్రూరమృగాలు రాకుండా ఎండు పుల్లలతో పెద్ద మంట చేసి, దాని చుట్టూ కూర్చుని కాలక్షేపం చేసేవారు. స్త్రీలు, పిల్లలు నిద్రపోతుంటే, పురుషులు కర్రలు, ఆయుధాలు ధరించి దివిటీలతో కాపలా కాసేవారు. చాలామంది సాధువులు కూడ అలాగే ప్రయాణం చేసేవారు.

శ్రీ బాబు కూడ అలాగే పాదచారులై ప్రయాణం చేస్తూఉంటే యాత్రికులతో పరిచయం ఏర్పడేది. వయస్సులో చిన్నవారైనా, ఎంతో తేజస్సుతో కనిపించే శ్రీ బాబుకు వారు ఎంతో ఆదరంతో ఆతిధ్యమిచ్చేవారు. స్వామితో కలిగిన ఆ సాహచర్యంతోను, సంభాషణల ద్వారాను, స్వామి మహాత్ములని వారు గుర్తించి మరింత గౌరవభావంతో చూసేవారు. “ఎవరి వద్ద ఒక గ్లాసెడు మంచితీర్థం తీసుకున్నా, వాళ్ళకు జీవితాంతమూ ఉపయోగపడే ఉపకారాలు అమ్మ నా చేత చేయించుకునేది” అని స్వామి అనేవారు. అలా ఆతిధ్యమిచ్చిన వారికి శ్రీ బాబు ఎంతో ఆత్మీయులై, వారి కష్ట సుఖములను, యీతి బాధలను అడిగి తెలుసుకొని, వాటన్నిటికి నివారణోపాయములను తెలిపేవారు. స్వామికి ఆతిధ్యమిచ్చిన ఫలితంగా వారి యాత్ర నిరాటంకంగా పూర్తికావటమే కాక, వారికి ఎన్నో సాంసారిక సమస్యల నుండి విముక్తి లభించేది.

యాత్రా సమయంలోనే కాదు; తదితర సందర్భాలలో కూడా ఎవరైనా ఒక్కసారి తమను సేవించుకున్న మాత్రానికే వారి సాంసారిక సమస్యల నివారణకై శ్రీ బాబు తాము స్వయంగా అండగానిలిచి, విచ్ఛిన్నమై పోవలసిన వారి కుటుంబాలను, దాంపత్యములను పునరుద్ధరించి సుఖ శాంతులను వారికి ప్రసాదించిన ఉదంతములెన్నో ఉన్నాయి.

ఉదాహరణకు : వల్లభాపురంలో మాటూరివారి కుటుంబము సోదరుల వైషమ్యాలతో ఛిన్నాభిన్నమైపోయే స్థితిలో శ్రీ బాబు నిద్రాహారములను లెక్కించక, గుంటూరు నుండి ప్రతిరోజూ ఉదయం 6 గం.లకు బయలుదేరి, వల్లభాపురం వెళ్ళి, రాత్రి 10గంటల వరకు ఆ కుటుంబ సభ్యులతో చర్చలు జరిపి హితవు చెప్పేవారు. ఇలా మూడునెలలు శ్రమించి, తుదకు ఆ కుటుంబం వారందరూ సుఖ శాంతులతో స్థిరపడే వరకు శ్రీ బాబు విశ్రాంతి తీసుకొన లేదు.

-సశేషం




(గతసంచిక తరువాయి) -రమణ ప్రసాద్

కొందరు బుధ జనులు కళ్ళతో సైగలు చేస్తూ తగ్గు స్వరంతో " ఏ స్త్రీ తన పతివ్రతా ధర్మం పాలన చేయలేకపోయిందో, ఆమె యొక్క వర్ణ సంకర సంతానమే ఈతడు '' అని గుస గుసలాడేవారు.మళ్ళీఅందరూ ఏమీ తెలియనట్టుగా గుట్టు చప్పుడు కాకుండా ఉండేవారు. ఆ వాక్యం పూర్తి కాకుండానే వెనుదిరిగేవారు!... మధురలో గోడలకుకూడా చెవులుంటాయని అందరికీ తెలుసు!...

ఇంక అక్రూరుడు మిగిలాడు!...అతడు ముక్తుడే! అసహాయులైన ప్రజలకు అక్రూరుడే ఒక ఆశా కిరణం. ఏదైనా చేయగలిగిఉంటే అది అక్రూరుడే... అతడు నిల్చి నేతృత్వాన్ని స్వీకరించాలి అన్నదే వారి ఆశ. కానిఆ వ్రజ ప్రజల ఆశ నిరర్థకమే అయింది. కొద్ది రోజులకే ఉగ్రసేనుడు బంధింపబడ్డాడు అన్న వార్త వచ్చింది. అంతకంటే హృదయవిదారకమైన దృశ్యాన్ని వారు చూశారు. - అది అక్రూరుడు మహారాజైన కంసుని ఆంతరంగిక సలహాకారులలో ముఖ్యుడుగా అధిష్ఠితుడు కావటం!..

కంసుడు సేనాని మాత్రమే కాదు. చతురుడైన రాజనీతిజ్ఞుడు కూడా!వ్రజ ప్రజల హృదయాలలో అక్రూరునికి కల స్థానం అతడికి ఎరుకే! అతడు తన తండ్రి ఉగ్రసేనుని రాజ్య భ్రష్టుడిగా చేసి అతనిని కారాగారంలో వేశాడు. కాని అతడికి వ్రజవాసులపై ద్వేషం లేదు.అతని ద్వేషం, వైర భావన ఉగ్రసేనునిపైననే.

తన తండ్రి పై ప్రతీకారం తీర్చుకోవటమే అతని ఉద్దేశ్యం. ఉగ్రసేనుడు రాజుగా తన నైతిక అధికారం కోల్పోయాడన్న భావన నారదుడు తనతో మాట్లాడిన వెంటనే అతనికి కలిగింది.

ఉగ్రసేనుని మహలులో, ఇంకా రాజమార్గములలో జరిగిన ఏదోఉత్సవములో నగరవాసులందరి సమక్షంలో తన తల్లిని ఉపేక్ష చేయటంకంసుడు చూశాడు.... గణాధిపతి ఉగ్రసేనుని అర్ధాంగి, కంసునికి తల్లి ఒక ఉపేక్షిత స్త్రీ.... మధురలోని సంపన్న ఆర్యులకు ఆమె ఒక తిరస్కృత స్త్రీ.....

ఎందుకంటే..... ఎందుకంటే....

లేదు.... లేదు... కంసుడు ఇదంతా మర్చిపోవాలని అనుకుంటున్నాడు.!....

కానిఏ సమాజం తన తల్లిని సన్మానం చేయలేదో..... ఏ పతి తన ధర్మపత్నికి సమాజంలో సన్మానం కలిగించలేకపోయాడో.... ఆ పతి. ఆ సమాజం.... ఆ శాసకుడు.... వీరెవ్వరూ సన్మాననీయులు కారు.... క్షంతవ్యులుకారు!.... కంసుడు మధురలోని యాదవ వంశీయులందరికీ, వారి భావితరంవారికీ తగిన గుణపాఠం చెప్తాను. ఎంతో గొప్పవారమను కుంటున్న ఈ ఆర్యులు, ఈ యాదవుల భావితరంవారు ఎన్నటికీ మరచిపోలేనట్లు బుద్ధి చెపుతాను... అని ముందే ఈ నిర్ణయం తీసికొనిఉన్నాడు. చాలాకాలంగా వేసుకొన్న తన పథకాన్ని అమలులో పెట్టటానికి అక్రూరుని అవసరం తనకు ఎంతైనా ఉంది...తను వేయబోయే చదరంగపుటెత్తులో అక్రూరుడు ముఖ్యమైన పావుగా పనికివస్తాడు!'' అని కంసుడు దృఢ నిశ్చయంతో ఉన్నాడు...

అక్రూరుడు కూడాఆశ్చర్య చకితుడైనాడు.... తనకు ఇంత సన్మానమా! తనను అత్యంత ఆంతరంగికునిగా స్వీకరించటమా!... మంత్రి మండలిలో తనకు స్థానం ఇవ్వటం..ఏమిటి ఇదంతా? ఏం జరుగుతోంది? ఉగ్రసేనునికి, వసుదేవునికి పట్టిన గతి తనకుకూడా పడ్తుందని భయం ఉండిఉంటుంది. అందుకే తనకు ఈ సత్కారం! తనలో ఉన్న భయం, చింత పోయి మనస్సు తేలికపడింది. ఆనందం కలిగింది. తను గణతంత్రంలో ఎంత ఉపయోగ పడ్డాడో, ఈకొత్త శాసనంలో తన ఆవశ్యకత ఉందన్న విషయం గ్రహించి అక్రూరుడు సతర్కుడైనాడు.... కంసునికి నేను ఉపయోగ పడితే, తరువాత నెమ్మదిగా వ్రజభూమికి విముక్తి కలిగించటానికి కారణభూతుణ్ణి కావచ్చు...

అందువలన కంసునికి తనపైన విశ్వాసం ఉండటం ఎంతో అవసరం. అప్పుడే తన ధ్యేయాన్ని సాధించ గలిగేది. కంసునితో విరోధం కారావాసానికి చేర్చటం తథ్యం... మధురలోని ఆ ప్రాసాదం... వ్రజభూమి విహారాలు... ఈ ప్రసన్నత... వీటిని త్యాగం చేసే ఉద్దేశ్యమూ లేదు. అందుకు సిద్ధంగా లేడు... అంత ధైర్యమూ లేదు....

అందుకే కంసుడు తనకు కబురుపెట్టి - " అక్రూరా!మీరు గోకులానికి వెళ్ళి ధనుర్యజ్ఞం నిమిత్తం నందుని ఇద్దరు పుత్రులైన కృష్ణ బలరాములను ఇక్కడకు తోడ్కొని రండి '' అని చెప్పగానే క్షణకాలం స్తబ్ధుడైనాడు! కంసుని ఆంతర్యం అతనికి అవగతం అయింది. యజ్ఞం అనే మిషతో వారిని మధురకు రప్పించి ముష్టికుడు, చాణూరుని వంటి అతి బలవంతులైన మల్లయోధుల చేతిలో

హత్య చేయించాలన్న ప్రణాళిక కంసుడు ఎప్పుడో వేసి ఉంచాడు అన్న విషయం అక్రూరునికి ముందే తెలుసు... వసుదేవుని పుత్రుడు అయిన శ్రీకృష్ణుడి హత్యకు తాను నిమిత్తుడు కానున్నాడన్న విషయం మదిలో మెదలగానే అతడు చకితుడైనాడు. కంసుని దృష్టి నుంచి ఏదీ తప్పించుకోలేదు. అతడు అక్రూరుని ఆలోచనలను వెంటనే గ్రహించాడు. గ్రహించి, ఇలా అన్నాడు " అక్రూరా గోకులవాసులు , వారిలో ముఖ్యుడైన నందుడు మిమ్మల్ని తప్ప ఇంకెవరిని విశ్వసించరు. గోకులంలోని ప్రజలు మధురలో తన రాజ్యాధికారాన్ని స్వీకరించారంటే దానికి భయమే కారణం. నామీద వారి అవిశ్వాసం పోలేదు..... కృష్ణుడికి కలిగిన ఉత్పాతాలను దృష్టిలో ఉంచుకొన్న నందుడు కేవలం మిమ్మల్నే విశ్వసిస్తాడు....."

"మహరాజా" ఆ పైన అక్రూరునికి నోరు పెగలలేదు. ఎవరో గొంతు పట్టేసినట్టు అయింది. కంసునికి విరుద్ధంగా వెళ్ళే సామర్థ్యం అతడు ఎప్పుడో కోల్పోయాడు.... ఇక ఇప్పుడు కృష్ణుని హత్య !... అతడు విచలితుడై కర్తవ్య విమూఢుడైనాడు....

"అవును అక్రూరా ఇదే నా ఉద్దేశం!" కంసుడు అధికారపూర్వకంగా అన్నాడు. -"ఇది మధుర రాజాధీశుని ఆదేశం.... ఎలాగైనా సరే కృష్ణుని నీవు తేవాల్సిందే. నాలో పెరుగుతున్న భయాన్ని అంతం చేయాల్సిందే. రేపు ఉదయాన్నే వెళ్ళండి...." అంతే! ఇక మాట్లాడటానికి ఏముంది. ఆపైన అక్రూడికి మాట్లాడే సాహసం ఎక్కడుంది. ఇక వేరే మార్గం ఏదీ లేదు.

ఆకాశంనుంచి ఒక ఉల్క చీకటిని చీలుస్తూ యమునాజలాలలో రాలి ఆ మహాజ్యోతి యమునా తరంగాలలో లీనమయిపోయింది. దుర్గంపైన మూడవ జాము తెలుపుతూ ఢంకా మ్రోగింది. అంతవరకు అతీతంలోని పుటలను తిరగేస్తున్న అక్రూరుడు కొంచెం ఆగి తలపైకెత్తి ఉద్ధవుడివైపు చూశాడు. ఉద్ధవుడి కళ్ళు ఆ చీకట్లో శూన్యంలో దేన్నో వెతుక్కుంటున్నాయి. చీకటిలో మసక మసకగా కనిపిస్తున్న రాజమార్గంలో - కంసుని కోసం వస్త్రాలు తీసుకొని వెళ్తున్న రజకుడు, పుష్పమాలు తీసుకువెళ్తున్న మాలి, కువలయాపీడం, సుగంధ పరిమళ లేపనాలను తీసుకు వెళ్తున్న కుబ్జ - దృశ్యాలు నిన్ననో మొన్ననో జరిగినట్లుగా అతని మనోనేత్రం ముందు కదలాడుతున్నాయి.

-సశేషం

---

Printed andPublished by C.V. Ramana Babu, on behalf of YOGINI SRI CHANDRA KALI PRASADA MATHAJI CHARITABLE TRUST and Printed at Samardha Sadguru Publications, D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh, and published at D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh. Editor - Guda Siva Rama Murthy,